శ్రీ

# చిరకారినాటకము.

———:o———

ఇది

బళ్ళారిలోనున్న డిస్ట్రిక్టుకోర్టు వకీలు

"ఆంధ్రనాటక పితామహ" యను బిరుదువహించిన

## ధర్మవరము-రామకృష్ణమాచార్యులచేత

రచియింపఁబడి

డి. కె. కృష్ణమాచార్లు, వారిసహోదరులవలన ప్రకటింపఁబడినది.

మొదటి కూర్పు.

బళ్ళారి

రమావిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1919



[క్రయము రూ. 1-0-0.]

శ్రీ

# పీ ఠి క

ఈచిరకారినాటకమునందలికథ భారతమునందలి శాంతి పర్వములోనిది. అందిది మిగుల సంగ్రహముగ నున్నను నిందతి విస్తృతమై నాటకకర్తలకుంగల నిరంకుశస్వాతంత్ర్యమును జాటుచున్నది. నాటకకర్తల కిట్టిస్వాతంత్ర్యముండదేని, దృశ్యప్రబంధముల యుత్పత్తియే లోకమున లేకపోవునని నిస్సందేహముగఁ జెప్పవచ్చును. ఈవిషయము నాటకపాఠకమహాశయులకు విదితమే. ప్రతినాటకకర్తయుఁ బ్రేక్షకులమనంబు నాకర్షించునిమిత్తము మూలములోని కథను నుచితరీతిని బెక్కుభంగుల విశృంఖలముగఁ బ్రకృతికి నవిరోధముగ మార్చి రస మట్టిపడునట్లు చేయుట సహజము. అట్లు చేసిననే, యదిసామాజకచిత్తాకర్షమును, రంజకమునునై సమీతార్థనిర్వహణ మొనర్పఁజాలును. వెయ్యేల? ఇంచుకయును, కథాపరిణామమును, సంవిధాననిపుణతయు, బొందక నాటకములు రుచింపవనియు, ప్రదర్శనార్హములుకావనియు నాయాశము.

2. ఈచిరకారి నాటకమున నీకథావిపరిణామము మెండు. ఇక్కథావిపరిణామమునకుమూలము. మూలములోని "విను మొక్కకారణంబున మునిపత్నిపైఁ గోపించి చంపఁ గొడుకుఁబంచి" ఒక్కకారణం బనుటయే? దానినాధారము చేసికొని కోపకారణమును వివరించువ్యాజమున విశృంఖలముగ మార్చి పాఠకులకు నీతివృత్తముత్పాద్యమని భ్రమపుట్టునట్లు గమ్యంగండు జిత్రముగ నైదంకలముగ రచించిన బ్రహ్మశ్రీ॥ రామకృష్ణకవిగారి ప్రజ్ఞావైశద్యము నెంతని పొగడవలయు.

3. పురుషులకు జారిణీత్వాశంక చేఁగాక మఱియేనను భార్యపై చంపునంతటి కోపము గలుగదని తెల్పుటకు గాబోలు మోహినికిఁ బురుషవేషమువైచి చంద్రరేఖతో సరసాలాపము లాడుచు, ముద్దు పెట్టుకొనుచుండ మేధాతిథి దర్శించినట్లు యీకథను కల్పించినాఁడు. ఈకల్పన కవియొక్క ధర్మజ్ఞతను, సంస్కర్తృత్వమును, వెల్లడించుచు, స్త్రీ లేవిధమున పరపురుషానుభక్తలైనను, బహిత్యాజ్యలే? స్త్రీలకు పురుషులతోడి సహాసనాక్రీడాసల్లాపాదులు అనర్థక ప్రదములగుటంజేసి పరిత్యాజ్యములని సూచించుచున్నది. ధర్మసంస్కరణము సంఘాభివృద్ధికని, నీత్యభివృద్ధికని మార్గములుకావని యెవరుచెప్పగలరు?

4. మూలమున కథానాయకుండగు మేధాతిథి మునియని చెప్పియుండ, నింపు రాజని చెప్పుటకు హేతువులేక పోలేదు. ముని యని చెప్పిన మునులకు భార్యను వీడి చిరకాలము ప్రవాసము చేయ వలసినంత ప్రసక్తియుండదు. రాజని చెప్పిన వేటకుగాని యుద్ధాదులకు గాని భార్యనువిడిచి ప్రవాసము చేయవలసినంత యవకాశము గలుగుటయేకాక, యీయనల్పకథాకల్పనాచిత్రలేఖనమునకు నుచితముగు సుధాస్పర్శము నబ్బునుగదా? రాజని చెప్పకపోయిన, మోహిని యవతరించుటెట్లు? మోహినిగాకున్న, భార్యతో పురుషవేషమున నేకాంతమున ముద్దులాడుచు సరసాలాపములాడుచు నాటలాడుకొనునంతటి చనువుగల స్త్రీయెట్లు లభింపవలయును? వాస్తవ పురుషుఁడైన భార్యకు పాతివ్రత్యభంగము గలుగుగదా? పునః పరిగ్రహణావశ్యంబెట్లగును?

5. శ్రావ్యప్రబంధములకంటె దృశ్యప్రబంధములు శ్రేష్ఠము లనుటకు కథాకల్పనయుఁ, దదుచితపాత్రపోషణయు, దానికిందగిన వాగ్రచనయు రసావిర్భావచణంబగు పదప్రయోగంబును ప్రదర్శ

నాస్వాంతమైన సంవిధానము మొదలగునవి కానరాగలవు. రామకృష్ణ కవిగారి యీనాటకముననేగాక యితరనాటకములయందును సిరి సంపూర్ణముగనుండి వారి "యాంధ్రనాటక పితామహుఁడు"ను బిరుదమును సార్థకపఱచుచు, ఆంధ్రము నాటకోచిత భాష కాదను ననాచ్య వాదమును నసత్యము చేయుచున్నది. వీరి నాటకములు చమత్ప్ర సఘట్టముల సాక్షి పెద్దగారి యుక్తులపాలికి సాహసాంజికులు మనః ఫలకములు నలంకరింపక పోవు. ఈయపూర్వ నిర్మాణచాతుర్యధురీణత వీరి కెట్టబ్బెనాయని విస్మయము గొలిపెడిని.

6. ఈచివరి నాటకమున, చిత్రనళీయమునందున్నంత భాషా గాంభీర్యమున్నట్లు తోఁచకుగాని, కథాసంవిధానము, సంవిధాన చాతురి, కల్పనావైదగ్ధ్యము మొదలగునవి వానికిం గౌరవపడవని నా యాశయము. నిక్కమానిన నాటకములందివియే ముఖ్యములు. భాషాగాంభీర్యాను లంతగ పాటింపబడలేదు. ప్రేక్షకజనచిత్తాకర్షణ సామర్థ్యమొక్కటియున్న చాలును. ఇది నైసర్గికధర్మమును, ముఖ్యముగ ప్రదర్శకుని యాశయమునకుండదు. పలుకప్రగాఢ వైచిత్ర్యము ముఖ్యసహకారి. భాషా గాంభీర్యమించుకేనియు లేక భాషా సౌష్ఠవ మేమాత్రమును లేకుండెగి, రసోచిత లలితమృదుపద ప్రయోగము సున్నమైయుండినను, సంవిధాన నైపుణ్య మొకటుంజేసియో ప్రదర్శన నైపుణ్యముచేతనో, ప్రేక్షకుల మనంబాకర్షింపజాలి భాషా వేత్తలకుగూడ విస్మయము నాపాదింప సమర్థములై వేనవేలు ద్రవ్యము సంపాదింప సమర్థములై మన్ననకుం బాత్రములై యలరు నాటకము లెన్నియోగలవు. వేషాడంబర మెంత కార్యకారియగునో, మహాశయ తెలుపఁగనదికాదు. నాటకములకు ప్రదర్శన నైపుణ్యమే మనోహర వేషము. ఈ వేషాడంబరమెంతయున్న నంతయధికముగ

నాటకములు రచించును. ఒక్కొక్కరికి విద్యావంతులకిని, వేషాడం బరము లేమి విద్యాహీనత నాపాదించునట్లు తన్నైపుణ్యముచే నెన్ని యో నాటకములు రసహీనములై ప్రేక్షకుల శిరోవేదనమునకును, పలాయనమునకును హేతువులగుచున్నవి. కావుననే యల్లసాని పెద్దన కృతిరచనకు "వాచక పాకోత్తముల్" యని గాంభీర ముగా చెప్పినవాఁడు. వాల్మీకి రామాయణమురచించి సమీచీన ప్రదర్శకులకై నిరీక్షించుచుండినది రసికులకు విదితమే? శ్రావ్య ప్రబంధములస్థితియిట్లుండ యింక దృశ్య ప్రబంధముల నడుగవల యునా? అదియేమి నైపుణ్యమోగాని బళ్ళారి సరసవినోదిని సభ వారు యెట్టినాటకమునైనను, తమప్రదర్శన విశేష విధానమున ఉత్తమనాటకము గావించి గ్రంథకర్తకు దిగంత విశ్రాంతకీర్తిని గల్పించి నపారధన సన్మానముల కలిగించుచున్నారు. దీనికి యీ కవి గారి శక్తియేకదా కారణము?

7. ఇందలి యస్వభాషాప్రయోగమునకు జనుల సహాసనిర తాళాపేక్షయు, రంగస్థల పరుషహాలి సమాకాంక్షయుగాక మరియేమి? వానికిదియే ముఖ్యసాధనము. స్వభాషాపద ప్రయోగ రసగ్రహణ పారీణత యెవ్వరికో యొక్కరికుండిన యుండుగాని, ప్రేక్షకుల కెల్లర కుండగలేదా?

8. ఇట్టి సంవిధాన చాతుర్యముగల యీనాటకమున సావి ర్భావ చమత్కృతి లేకయుండునా? వీరి నాటకములు ఆబాల గోపా లము సుప్రసిద్ధములగుటయే యీవిషయము స్థిరపరచుచున్నవి. ఇందలి రసపుష్టిగల పద్యముల పాఠకులే రసాస్వాదనముగావించి సంత సించుదురుగాక. సుప్రసిద్ధులగు ఈ కవిగారినిగురించియు, వీరి నాటక ములగురించియు మిక్కిలి యుపోద్ఘాతము వ్రాయ నక్కరలేదని యింతతో విరమించుచున్నాను.

చింతలపల్లి. నరశింహశాస్త్రులు,
మునిసిపల్ హైస్కూలు
ప్రధానాంధ్రోపాధ్యాయులు.

బళ్ళారి,
4—8—19.



## ఈనాటకమున ముఖ్యపాత్రలు వారి వేషస్థలములు.

### పురుషులు.

1. మేధానిధి—(మిథిలాపురరాజు) అం. I రం 1, అం. II రం 3 అం. IV రం 5, అం. V రం 2, 4, 6.

2 కళానిధి—(యువరాజు) అం I రం 1, అం. II రం. 3, అం IV రం 1, 3, 4, అం V రం. 3, 6.

3 విశారదుఁడు—(మంత్రగుప్త పుత్రుఁడగు జయసేనుఁడు చంద్రరేఖ పెంపుడుకొడుకు) అం. II రం. 3, అం IV రం. 4, అం V రం. 5.

4. శ్వేతకేతుఁడు—(మేధానిధి తమ్ముఁడు) అం II రం. 3.

5 నీతివేది—(మేధానిధి మంత్రి) అం I రం 2, 3.

6 వసంతుఁడు—(పుష్కరాగ్రహార నివాసి) అం. I రం. 4.

7. మంత్రగుప్తుఁడు—(అవంతిపురపురాజు చంద్రరేఖ అన్న) అం V రం. 5, 6.

8. సిద్ధుఁడు—అం. V రం 4

9. ఋషికుమారుఁడు—అం. IV రం 5, అం V రం 5, 6.

10. మనోహరుఁడు—(విటుఁడు) అం. III రం. 1, 2, 3.

11 నల్గురు విటులు—అం III రం. 1, 2, 3.

12. పంజు దొంగలు—అం I రం. 5.

13. కాటిసాపలు—అం. II రం. 1.

14 కోఁతిచెలు—అం III రం 1.

### స్త్రీలు.

15. చంద్రరేఖ—(మేధానిధి భార్య) అం. I రం 1, 2, 4, అం II రం. 2, 3, అం. IV రం. 2, 4, అం. V రం 2, 3, 6

16. తిలక—(చంద్రరేఖ సఖి) అం. I రం. 1, 2, 3, అం. II రం. 1, 2, 3, అం. IV రం. 3, అం. V రం. 6.

17 మోహిని—(మల్లికసాని యిడినపేరు) అం. III రం. 2, 3, అం. IV రం. 1, 2, 3, సులోచన—(మేధానిధిబిడ్డ) అం. V రం. 1, 2, 4, 6.

18. మల్లికాసాని—(వేశ్యమాత) అం. III రం. 2, 3.

శ్రీ

# చిరకారి నాటకము.

———:o:———

## కథాసంగ్రహము.

### ప్రథమాంకము.

రం. 1. మేధానిధిరాజు చంద్రరేఖ యనుయువతిఁగనిసి కామాసక్తుఁడై యామెవెంట వెడలుట.

రం. 2. చంద్రరేఖ తనపుత్రుఁడనియను శ్వేతకేతురాజు పలుకఁగవిరిగిన యపహాసములను సహించక నీతివేదితో చెప్ప నతఁడు మాన్ప బ్రయత్నించుట.

రం. 3. శ్వేతకేతు రాజువలన బహిష్కృతిఁ గలిగిన నీతివేది సంతాపము.

రం. 4. అన్నగారి యాజ్ఞను అనంతపురము నకుఁ బోవుచున్న మంత్రియగు కళానిధియను కుమారునిఁ బోగొట్టుకొన్న చంద్రరేఖ సంతాపము నవనీతుఁడను బ్రాహ్మణుఁడు, చంద్రరేఖ ప్రసవించువఱకు తనగృహమున నుండుమని ప్రార్థించుట.

రం. 5. పుష్పారామభాగము దోపిడిచేసి పోవనెంచుచున్న పంజుదొంగలకు నొక బాలుఁడు దొరకుట.

### ద్వితీయాంకము.

రం. 1. పంజుదొంగల యార్భాటము కులికిపడి మూర్ఛిల్లియున్న చంద్రరేఖ ప్రసవించి చచ్చిపుట్టిన కూఁతురును శ్మశానమున తిలక పాతిపెట్టుచుండఁగా వనమృగారావము విని భయపడి తిలక వెడలిపోవ, కాటిపాపలు ఆపిల్లనెత్తుకొని పోవ, తిలకవచ్చిచూడ యాపిల్ల కానబడనందులకు చింతించుచుండ నారక్క యనుశూద్రి యొకపిల్లవానిని తిలకకు నమ్ముట.

రం. 2 మూర్ఛనుండి తెలివిగలిగిన చంద్రరేఖను లింక కుమారుచే ప్రసవించెనని చెప్పి సమాధాన పరచుట. మేధానిధి కళానిధుల వృత్తాంతములు తెలియ వచ్చుట.

రం. 3. మేధానిధి చంద్రరేఖా కళానిధుల సమాగమము శ్వేతకేతుని పశ్చాత్తాపము. చంద్రరేఖ క్షమ.

## తృతీయాంకము.

రం. 1. వేశ్యాప్రభాగునకుఁ బోవు విటుల వినోదసంభాషణము. కానసుందరుని తమగుబోటు.

రం. 2. కాటిపాపలవలన వెలకుగొనిన పిల్ల మల్లికాసాని యను బోగముదానింట మోహిని యను పేర బెరుగుట. వారికిరువుర యభిప్రాయ భేదములు.

రం. 3. మనోహరుడను విటుడు మోహిని చెరుపవచ్చి ఆమెచే సన్మార్గ బోధన వడయుట. మల్లికసాని దుఃఖము. ఇతరవిటులు మనోహరుని గురువుగా భావించి వారి భక్తులగుట. మల్లికాసాని మోహినిని కోపించి దండింపఁబోవ ఆమెను యిల్లు వెడలిపోవుట.

## తురీయరంగము.

రం. 1. ఆరణ్యమున కోటి దవారిచే జిక్కియున్న మోహినిని, విశారదుడను రాజు కుమారుఁడు రక్షించుట.

రం. 2. మోహిని మేధానిధిరాజు ప్రాపున చేరినందునకు సంతసించుచు, కళానిధి గిన్ని మోహించియుండుటచే స్వల్పభయము చెందుట.

రం. 3. చంద్రరేఖయొద్ద మోహిని పిన్నాటలుచేయుట.

రం. 4. కళానిధి రాజుకుమారుని మోహనోన్మాద సంతాపము.

రం. 5. మోహినియొక్క సుచిత్రమువలన, తిలకయు, చంద్రరేఖయు చెవిటివారలగుట మేధానిధి మోహినికి "సులోచన" నామకరణము గావించుట.

## పంచమాంకము.

రం. 1. నిద్రించుచున్న మోహినిని తిలక లేపబోవ ఆమె నెదపైనున్న సూత్రాన్వి కత్తిగల వస్త్రమును చూచి ఆశ్చర్యపడి పోగొట్టుకొన్న మేధానిధి బిడ్డనుగు సులోచనగా నిర్ధరించి జరుగనున్న మోహినీ కళానిధుల వివాహమును మాన్ప నిర్ధరించుకొనుట

రం 2. మగరూపమున సులోచన చంద్రరేఖనొద్దనుండుటను చూచి మేధానిధితో చంద్రరేఖను చంప నాజ్ఞయిడుట.

రం 3 తండ్రియాజ్ఞనైన కళానిధియొక్క పరితాపము.

రం. 4. మగరూపముననున్న సులోచనను మేధానిధి చంపబోవ ఆమె తన నిజరూపమును చూప చంద్రరేఖను విధించిన దండనమునకు తాను దుఃఖించి, దాని మాన్పబోవుట

రం. 5. మంత్రగుప్త విశారదుల చిత్రసంభాషణము చంద్రరేఖ శిరచ్ఛేదనము చేయబడుట తెలసి యప్పటికి వాగలుబోవుట.

రం. 6. విద్యాలయమున తల్లిని చంపలేక పరితపించుచున్న కళానిధిని మేధానిధి సులోచనలు వేళకెదగి నిలుపుదలచేయుట. తిలక, విశారద మంత్రగుప్తులే తెంచుట. తిలక సులోచన యెవ్వరైనది తెలియచేయ అందరికి నానందము జనించుట. మేధానిధి కళానిధికి చిరకారినామంబిచ్చుట. అందరికి నానందము కలుగచేసిన దైవమును స్తవమొనర్చుట.

—: మంగళం. ఉత్తర రంగము. :—



శ్రీ

# చిరకారి నాటకము.

## ప్రథమాఙ్కము-ప్రథమరంగము.

మేధానిధి నగరు.

[ చంద్రరేఖ (పండుకొని) ప్ర: మేధానిధి. ]

చంద్ర—(లేచి) హా నాథా! నిన్నుఁబాసి నేనొక నిమిషమైన జీవింపఁగలనా?

(అనుబంధము 1.)

మేధా—కాంతామణీ! ఊఱడిల్లుము. ఏనాఁడుగాని మనమెడఁబాయవలయుఁగాక శాశ్వతముగాఁ గలసియుండఁగలవారము కాము. నీవేలయోచింతువు? ఈ పది సంవత్సరములు పదిదినములుగాఁ గడచనఁగలవు చూడుమా, మనకళానిధి నిన్న బుట్టినట్లున్నది. అప్పుడే యాఱుసంవత్సరముల వాఁడాయెను.

చంద్ర—నాథా! ఈరాజ్యమెట్లు బాసిపోఁగలవు?

మేధా—తరుణీ! రాజ్యవ్యసనమునకంటె వేఱువ్యసనమున్నదా?

సీ॥ కరుణచూపకయున్నఁ గడుక్రూరచిత్తంబు కరుణచూపఁగఁ జేతఁ
గానితనము। దండనంబొనరింపకుండినఁ బాపంబు దండనం
బొనరింప దుండగంబు। న్యాయంబుతీర్పకున్నను ధర్మలోపంబు
న్యాయంబుదీర్ప దుఃఖాతిశయము। ఇఁకభృత్యపాలినమ్మక
యున్నఁ గ్రోధంబు భృత్యులనమ్మ దుష్కృత్యగరిమ।

తే॥గీ॥ ఇటులఁజూచినవారాశియటులఁజూడ!
భూరినదితాస్రుసదండియఁబోలెసమత।
దాల్చునీయసిధారావ్రతంబుచాలు।
రాజ్యదుఃఖంబుదీనిఁగోరంగఁదగునె॥

కావున నాకేమియు నితరవ్యసనములేదు. శంకింపక నాపయనమునకానతిమ్ము.

చంద్ర—నాథా! నేనెట్లీ పయనమున కీకొందును? నేనును నీవెంటవత్తుఁ దోడ్కొని పొమ్ము.

మేధా—సతీమణీ! సిద్ధపుంగవుఁడు రహస్యమంత్ర పురశ్చరణమునకై నన్నొంటిగా రమ్మనియున్నాఁడు. మగ్గసీమల నియమము నుపాసింపఁదగియున్నది. ఆనతిమ్ము.

చంద్ర—అకటా! నీముద్దుకుమారునిఁ గళానిధినిమాని నీవెట్లుండఁగలవు? నిన్నుబాసి నేనెట్లుండఁగల్గుదును.

మేధా—నీవేలయిట్లలఁత చెందెదవు? నేనొక్కఁడ లేకుండుఁగాక నీకలిమికేమైన తక్కువా? మఱఁది రాజ్యమేలెడు. కొడుకు యువరాజయ్యెడు.

చంద్ర—నీవులేని యెల్లకలుములు నేల? నేనుండఁజాల.

మేధా—తరుణీ! మూఁడుదినములనుండి చెప్పుచున్నానే.

చంద్ర—అయిన నీమాటయిన నాదరింపుము. నాగర్భభారము తీరునంతవఱకైన నుండుము. నాల్గునెలలేగదా?

మేధా—చంద్రరేఖా? ఈయాశ్వయుజ మాసముననే నియమోపక్రమము చేయఁదగియున్నది, గాన విధిలేదు. నాకేమైన ద్వేషమా? గర్భమన్న జ్ఞాపకమునకువచ్చె. నాకీతూరి కూఁతురుగలుగఁగలదని పెద్దలనిరి. అదియె నాకభిలాషము. ఆకూఁతురికి సులోచనయని పేరిడుము. లేకొకవేళ కొడుకేకలిగినా విశారదుఁడని యిడుము. ఆనతిమ్ము.

చంద్ర—ఎప్పుడు ప్రయాణము?

మేధా—తొలిజామున నే.

చంద్ర—హా! నాథా! (అని మూర్ఛిల్లును).

మేధా—చంద్రరేఖా! ఇట్టిభ్రాంతి నీకుదగునా?

(అనుబంధము 2.)

యిదిగో కళానిధి వచ్చుచున్నాఁడు. ఊఱకుండుము.

[ప్ర: కళానిధి తిలక.]

కళా—అమ్మా! యిప్పటికి దుఃఖించెదవు?

తిలక—అయ్యా! నేనంతయుఁజెప్పెద నూరకుండుము. చంద్రరేఖాదేవీ! భోజనము వేళయినది లెమ్ము.

(నిష్క్రమింతురు.)

—— o ——

ద్వితీయరంగము-మేధావిపురము.

——:o:——

[ప్ర: తిలక, చంద్రరేఖ, నీతివేది.]

తిలక—చూచితివా! నీతివేది! ఈచంద్రరేఖాదేవికి మఱఁదియగు శ్వేతకేతుఁడను దురాత్ముఁడు—

నీతి—నీపుణ్యమగు మెల్లఁగమాటలాడుము.

తిలక—ఈసతీమణి పిలుపించినను రాఁడాయె. ఈమెకుమారుని దుడుకులాడె. ఈమెకు బాధకలిగియున్నదని వైద్యుని బిలుపింపుమన్న వైద్యుఁడు రాఁజాలఁడనియె. ఈమె యన్న మంత్రగుప్తరాజు పురమునకైనఁ బోవుదమన్న వాహనములు లేవనియె. ఒకటని చెప్పుదునా?

నీతి—మంత్రగుప్తరాజుపురమున కిప్పుడెల్లుపోవఁగలను. అతనిశత్రువు సమరసన్నాహము లెన్నిటో చేయుచున్నాఁడని యతఁడు జాబువ్రాసియుండలేదా? కావున్న నతఁడేవచ్చి మిమ్ముఁబిలుచుకొనిపోయి యుండఁడా?

చంద్ర—నీతివేదీ! నన్ను శాసింప నధికారముగల మామామగారితో మాయత్తగారితో నానాథునితో నిందు సహస్రాంశము తిరస్కృతిమేలుఁగ.

(అనుబంధము 3.)

నీతి—అమ్మా! ఊఱడిల్లుము.

కం॥ రాకాసితాంశుముఖియిఁక।
శోకింపకుఁదల్లడిలకుసురుచిరగాత్రీ।
లోకింపుమయూఱడిల్లుము।
నీకార్యమురాజునొద్దనేనొనరింతున్॥

నే నెంతయు మాటలాడివత్తును పిలవిందు.

(యవనికపడును).

---

## తృతీయరంగము—అడవి.

---

[ ప్ర: నీతివేది (జాబుపట్టుకొని). ]

(అనుబంధము 4.)

నీతి—ఆహా! నాయట్టి నిర్భాగ్యుఁడెవఁడైన నుండునే. ఈ శ్వేతకేతుఁడను దురాత్ముఁడు నాకిట్టి క్రూరదండనమిచ్చునే. ఈ నేరమునకా యీదండనము? కన్నతల్లిఁ బోలె నున్నవదిననే యింతపరాభవించిన వానికిది నేరముకాదా? పిలువనంపిన వెంటనే యామె యింటికిఁబోయితినఁట. అందునకా రేండ్లు రాజ్యబాహిరుఁడనై పోవలయునఁట. మేధానిధిరాజేంద్రా! నీకాయసిద్ధిపై నొకబండపడుఁగాక. నాకును, నీయాలుబిడ్డలకును నెంతదుఃఖము గలిగించితివి. ఆసిద్ధుఁడనెడు యమకింకరుఁడు మాకేడ దాఁపురమాయెను. వాఁడేతెంచికదా మారాజునకుఁ బిచ్చి పట్టించి యీడ్చుకొనిపోయి, మమ్ముఁబులివాతఁ గప్పగించె. అయ్యో! ఆపతివ్రతామణి చంద్రరేఖాదేవి యెట్టియాపదపడెనో! నన్ను రాజ్యబహిష్కృతునిఁజేసిన

వార్త విన్నంతనే, యీదేవిచెలియగు తిలకతో, కుమారుఁడు కళానిధితో నన్నగారియూరికి నవంతిపురికిఁ బయనమై యొకరికింజెప్పక వాహనము నైనఁగొనక పోయెననివింటేఁగదా? దారిలో నెంతపాటుపడుచున్నదో? మూఁడుదినములాయెఁగా నేనూరువిడిచి. నాసామ్రాజ్యమంతయుఁబోయి లోకమంతయు మునిఁగినట్లున్నదే! ఇంక నీయాఁకోఁడు లెట్లుండు? హా! దుఃఖము. (నిష్క్రా).

---

## తురీయరంగము—అడవి.

---

[ప్ర: చంద్రరేఖ, తిలక.]

చంద్ర— (అనుబంధము 5.)

తిలకా! ఏఁడే నాకుమారుఁడు? ఎందున్నాఁడే?

తిలక—(స్వ) హా! పాపిదైవమా! ఏమిగతి తెచ్చితివి?

[ప్ర: నవనీతుఁడను బ్రాహ్మణుఁడు.]

నవ—ఎవరమ్మా! మీరు పురుషసహితలుకాక యిట్లు కానలొంటిగా వందురుచున్నారు?

తిలక—బ్రాహ్మణోత్తమా! అవంతిపుర మెందున్నది?

నవ—పదియామడలున్నది అవంతిపురమున మీ రెవరు?

తిలక—బ్రాహ్మణోత్తమా! నీయూరు పేరు లేవి?

నవ—నేనీపుష్పాగ్రహారమున నుండువాఁడ. అవంతిపురము మా కల్లుఁడుండు పట్టణము. మంత్రగుప్తరాజున కతఁడు పురోహితుఁడుగానుండెను.

చంద్ర—మంత్రగుప్తరాజునకు క్షేమమా?

నవ—అమ్మా! ఫణికేతుఁడా రాజుసేనాని లోఁజేసికొని జయించి రాజ్యభ్రష్టునిం జేయగా నెందుఁబోయి యుండుటయు నెఱుఁగఁబడదు.

చంద్ర—హా! మంత్రగుప్తా—(అని మూర్ఛిల్లును).

తిలక—బ్రాహ్మణోత్తమా! ఆరాజెప్పుడు రాజ్యభ్రష్టుఁడాయెను?

నవ—అమ్మా! ఆదుఃఖమేమనవలయు. అతనికుమారుఁడు జయసేనుఁడు సంవత్సరము వాఁడుండె. ఆపాపని వర్షవర్ధంతి మహోత్సవము చేయనెంచియున్న నాఁడే పరాజితుఁడాయె. అమ్మా! ఈతన్వి యెవ్వరు?

తిలక—భూదేవశిరోమణీ! లోకమున నెవరుగాని యీసుందరీమణివలె భంగపాటు గన్నవారులేరు. ఈమె మేధానిధి రాజుభార్య.

నవ—మంత్రగుప్తరాజుతోఁ బుట్టువా? అయ్యో!

తిలక—అవును. ఆమె మగఁడైదునెలల యాపన్నసత్వ నీమెడించి సిద్ధునివెంటఁబోయెను. రాజ్యమేలు మఱఁదియొనర్చిన యవమానమునకు మనసోపక, యీతన్వి తనసుతునితోఁగూడి ననుఁదోడుగాఁ జేకొని, యన్నగారియూరికిఁ బయనమై రాఁగా, దోవలో శ్వేతకేతునివలనఁ బంపఁబడిన కొందఱు దురాత్ములీమెసుతుని నాలేఁడుల యీడుగల కళానిధియను వానినెత్తుకొనిపోయిరి. అప్పుడు మూర్ఛనొందిన చేడియ మూఁడుదినములకుఁ దెలివివచ్చె. వచ్చెగాని, పిచ్చిపట్టినచందమున మాటలాడసాగె. ఇపుడష్టమాసాంతర్వత్నియై యున్నది. పిడుగుపాటుబోలిన యీవార్త విని మూర్ఛిల్లె. ఈమె బ్రతుకఁజాలదు.

నవ—అమ్మా! యీమెమాతల్లి. మంత్రగుప్తరాజు తండ్రియగు పుష్కరరాజుచేఁ గట్టింపఁబడినందున మాయూరు పుష్కరాగ్రహారమునాఁబరఁగు. మాయింట నీమెకు విడిదిచేయించి ప్రసవించువఱకు బంధువుల యిక్కువ తెలియువఱకు నందేయుండనిమ్ము. పోదమురమ్ము. (యవనికపడును).

---

## పంచమరంగము—అడవి.

—:o:—

[దివ్వటీ దొంగలార్గురు.]

దొంగలు— (అనుబంధము 6.)

మీసాల రంగఁడు } షల్లిగా! ఈపొద్దు మనమేడికి పోదామంటివి?

చెవుల పుల్లిగాడు — తియ్యాస్సీ నీవు జాంజాంకు మరుస్తావు. అగ్రహారంలో పోలిశెట్టింటికి పోదామనుకోవుండ్లే?

మీసా—అవురా పుల్లిగా! అవుతే యీదోవలో యేంశిక్కేటట్టులేదో?

పుల్లి—మీసాలరంగా! మీసాలరంగా! నీకియ్యేకంలేదుపో. పోలిశెట్టిపెట్టె పగలమొత్తితె శిక్కేటంతనీకు యెంటికకాడ యాడశిక్కాల్రా?

1వ దొంగ—ఓ మీసాలరంగపొప్ప!• ఓ శెవులపుల్లన్నో. ఇక్కడనూడి. యెవతో గుడ్డుపెట్టిండాది. పిల్లోడు పక్కలోవుండాడు.

మీసా—ఎత్తుకోరాశ్శి.

1వ దొంగ—(పోయి తెచ్చును).

చె: పుల్లి—పీనమ్మనాయాలుబవుబాగుండాడార్రి. నిద్దపోతాడా? గుడ్డుపెట్టిండాడా?

మీసా—వరే, వరే, బాగుండాడు. మాముపెంచుకుందామేమిరా పుల్లిగా?

పుల్లి—తీయస్సీ. వోరికైనయిస్తే పది గోలైనాయిస్తారు. యీడాలార్రిమాకు?

మీసా—అవురాపుల్లిగా! అందుకే యిక్తికాడొకడుండాలనేది. వరేయెట్టుగా! యీ కుట్రోణ్ణి గంపకిందేసి మూసిపెట్టు. మనపనిఅయినంక పుల్లిగాడమ్ముకొస్తాడు.

పుల్లి—పోరార్రిరి! మాట్లాడేవు. గంపకిందమూసిపెడ్తే-అరిస్తే-యెవడన్నానూస్తే-గుమ్ముకోపోతే-పండ్లిగిలించేదికదూ?

మీసా—ఏమిశెయ్యాలార్రిమరి?

పుల్లి—వరేయెట్టుగా! నీవురాకుంటేపోయె. మాయాపెకిచ్చిరాపో రేపమ్ముకొస్తుంది.

మీసా—సై సై పోరాయెట్టుగా. వొరేయెర్రగాడొద్దురా వాడులేకుంటే యట్ల. మొనగాడు. కదిరే నీవుపోరా.

పుల్లి—వరే బైగా! అడేమో యెవతోగుడ్డుపెట్టిందంట్వే. సొమ్ములేమీ లేవేంరా?

బైగా—ఇదిగో కొండొచ్చిండాము.

పుల్లి—యేయి? మాయాపెచేతికీరా. రేపు పయిట్యాల నూసుకొందాం.

మీసా—యేంరా? పూరుకాటికే వచ్చిండాము యింకపొద్దు పొడిపింతామా?

అందరు—పొద్దుపొడిపీయట్టి. బొడిపీయట్టి. (అందరు దీవటీలువెలిగింతురు)

(అనుబంధము 6 మూడవచరణం.)

(కోబలి తేబలియని యూలలువేయుచు నిష్క్రి.)

—: ప్రథమాఙ్కము సమాప్తము :—



# చిరకారి నాటకము.

—————: 8 :—————

## ద్వితీయాఙ్కము ప్రథమరంగము.

———o———

### రుద్రభూమి.

[ ప్ర: తిలకకున్తలియు పుట్టి చచ్చినశిశువును గైకొని. ]

తిలక—అయ్యో! ఈయింత సంతోషమునకైనను మా చంద్రరేఖ నోఁచదాయె. దుఃఖమును బంచిపెట్టుటకు దైవమున కెవ్వరును లేకపోయిరి కాబోలు. కాకున్న నన్నిదుఃఖములు నీమెకేకలుగునా? అకటా! ఎంతముద్దుకూఁతురు. ఈబిడ్డకు వామస్తనమున మత్స్యాకృతిగాఁ బుట్టుమచ్చగలదు. ఇట్టున్న పూర్ణాయువనియు భాగ్యవిశేషమనియుఁ బెద్దలందురు. ఏమదృష్టము! ఏమాయువు! చచ్చియే పుట్టియున్నదిగదా! అయిన నొకటిమాత్రము సంతోషకరము. మాచంద్రరేఖకు నెలదినములనుండి తెలివియొక్కింతయు లేకున్నందున, ప్రసవింపఁజాలదనియు కడుపులోని పిల్లతోడనే మృతిజెందుననియు వైద్యులుశంకించిరి. నిన్నరాత్రిగలిగిన పంజుదొంగల యార్భాటమున కులికి యులికిపడుచుండెను. అందువలననే ప్రసవవేదనము కొంత కలిగికనెను. తెలివిలేకయుండినను చంద్రరేఖ జీవించుటకెంత యాకరమైనదే సంతోషము. దీనినిందే యిక్కడ ఖననముచేయుదు (గుంతతీయుచు) మాచంద్రరేఖ మేలుకనిన నీశిశుమరణదుఃఖ మెట్లనుభవింపఁగలదు. ఉన్నయొక కొడుకును బోయెఁగా? ఇదియయినఁ జక్కఁగనుండరాదా?

లోపల సింహాగర్జనము.

ఏమిది? భయంకరారావము వినుపించె? తెల్లవాఱుచువచ్చె. ఇపుడుపోయి మరల వత్తుఁగాక. (నిష్క్రమించుచుండ శిశువఱచును.)

[ప్ర: కాటిపాపలు, బొమ్మనాయకుఁడు, భైరదేవుఁడు,

వీరలింగము, మొదలగువారు.]

కాటిపాపలు—— (అనుబంధము 7.)

బొమ్మ—లింగమయ్యా! జిన్న చింగముదోవు పోయిందెక్కడ?
వీర—బొమ్మనాయకా! ఇక్కణ్ణే వణికేళి కూళారంకూచిండ్లాౖ?

(శిశువ అచు ను.)

భైర—లింగమయ్యా! యెక్కణ్ణో బుడుత గుంటకొక్కసి కూస్తాది.
వీర—భైరదేవా! యాణ్ణో తెల్లాౖ.

(అఱచుచున్న శిశువునుసమీపించి.)

కూకణ కాకణ. యిదోరాపాతు.

బొమ్మ—లింగమయ్యా! ఎంతముద్దోస్తు. కూకణ కణకణ.
భైర—బొమ్మనాయకా! ఇదేంపీ. గుంతబ్బతీపిండారు. గద్దిండాదని మెుఁబోవి వందిండారు. బుడుతగుంటకొక్కశింది.
బొమ్మ—లింగమయ్యా! లింగమయ్యా! వమ్మాట. హేమాపట్టంలో మళ్ళికాపాణి బోగోందివుండ్లే—శెప్పిండ్లాౖ.
వీర—అవునోయి బొమ్మనాయకా! పిల్లనుకొణేకి తెచ్చిమ్మండో)స్తు. కాకణ కణకణ
భైర—మంచియిద్దెమాయి. నూగ్లెశివందుతాయి.

(అనుబంధము 7.) (నిష్క్రా.)

[పునః ప్రవేశము-తిలక.]

తిలక—ఏదోయొక సింహగర్జనముపోలిన యారావమువిని భీతిల్లి వెడలితిని. పోవునప్పుడు శిశువఱచిన శబ్దమువినఁబడియె. మరలవచ్చి చూతుఁగదా శిశువు లేకుండెడు. ఇది యేమాశ్చర్యము? నాకుసమీపముననే శిశురావము విననయ్యె కావున మాచంద్ర

రేఖబిడ్డయే సజీవయయి యుండవలయు. ఇంతలో దుష్టమృగములేవైనఁ గొనిపోయెనా? లేక యెవ్వరైన జనులింకువచ్చియుండి యెత్తుకొనిపోయియుందురా? ఇందెందును జనులువచ్చిన సవ్వడియేలేదు.

(ప్ర: చెన్రుల పుల్లిగానిభార్య నారక్క (అఱచుచున్న పిల్లవానినెత్తుకొని).

నారక్క—(స్వగతం) నాకొండె యెందుకరుస్తావు? చన్నిచ్చిండ్లే? ఈ హీ హీ హీ మాయాతగాడు చెస్తాను. "వయ్యా" కుర్రోణ్ణి అమ్ముకొస్తే రెండుగిన్నెలు సారాయి పోయిస్తాడంట. వకమాడ యిస్తాడంట. మాడేంటికో? నాకోకలు నాలుగేసిబుడ్లుతాగేది. నాకురెండుగిన్నెలంట ఏంటికో. నాను నాలుగుబుడ్లు తాగుతాం. అవూళ్లో గొల్లపల్లెలో యింవెతిరనాళ్లు. అమ్ముకొచ్చేందుక్కా చేసొతుంది.

తిలక—(ఎదురుపడి) అక్కా! నీవెవరు?

నారక్క—ఎవరైతేనీకేం వాగిశాలీ!

తిలక—నీవెవరైన నేమిగాని దారిలో నీకెవరైన నెదురైరా?

నారక్క—కాటిపాపలు పోయిరమ్మా.

తిలక—వారియొద్ద నేమైన నఱచుచున్న పిల్లయుండెనా?

నారక్క—(స్వ) ఇదేందిరాయిది. యిట్లడుగుతాది. (ప్ర) నేమూ ల్లేదమ్మా.

తిలక—వారెంతదూరమునున్నారు?

నారక్క—శానా—శానా—శానా దవ్వు.

(శి శు వ అ ఱ చు ను.)

తిలక—(స్వ) ఆహా! ఇదియేదొంగ. (ప్ర) ఎవతెవేనీవు? ఆపిల్లనిందువిడువుము.

నారక్క—(పలుగెత్తును)

తిలక—(వెంటనంటి పలుగెత్తి పట్టుకొని) దుర్మార్గురాలా! విడువుమాపిల్లను.

నారక్క—ఏందమ్మా? యిట్లుకోకపట్టి నిలేశిండావు? (స్వ) దీనబ్బడాలు యిది మొగోడబ్బా.

తిలక—నీప్రాణములుతీయుదును. విడువుము.

నారక్క——నేనేం దొంగులుకొచ్చిండ్లే నీవడిగేకి? ఆడ్యాణ్ణో, పడిణ్ణింది. తల్లిసచ్చిణ్ణింది. మాయాతగాడెత్తుకొచ్చిండాడు.

తిలక——కానీ. నాకు తెలియును. మొదట నాపిల్లనువిడువుము.

నారక్క——ఏమిస్తావు?

తిలక——నీకేమివ్వవలెను? విడుతువా లేదా.

నారక్క——యిట్లనే గొంతుపిసికి సంపేస్తాను పదిరోరలిస్తే యిస్తాను.

తిలక——నీపేరేమి?

నారక్క——ఏమిబాగిశాలీ! బెదిరించేవు. శెప్పతాఁలే. నాపేరు నారక్క.

తిలక——ఏనారక్క?

నారక్క——ఓయన్నల్లాలా! నేబెదిరేదాన్ని కాను. చెవులపుల్లిగాని లంజనారక్క శెప్పకో యెవరితో శెప్పకుంటావో. యిప్ల నే గొంతుపిసికి పారేసిపోతాను. నీవు యింక శెయ్యేమేస్తావు?

తిలక——(స్వ) ఈపలుగాకిముండ యిట్లనేచేయుటకుఁదగినదే. (ప్ర) అయిన నేమీవలెను?

నారక్క——పదిరోలు.

తిలక——ఇదిగో! దీనితీసికోను. (అని తన చేతి బంగారుకడియమిచ్చును).

నారక్క——(తీసికొని బట్టమూటలోనున్న పిల్లవాని నప్పగించి చెట్టి పఱుగెత్తిపోవును)

తిలక——(ముడివిప్పి చూచి) ఆహా! ఇదిమా బిడ్డ కాదు. అధిక తేజోవంతుఁడగు బాలుఁడు. చూడఁగా రాజుకొడుకువలెనున్నాఁడు. వీని మొలత్రాటనే దోరతుకట్టియున్నారు. ఇది రాజచిహ్నముగానున్నది. కొడుకును పోఁగొట్టుకొన్న మా రాణికిఁ బ్రొద్దుపోవుటకు వీఁడొక కారణముగానుండఁగలఁడు. అయిన నా బిడ్డనేమాయెను? పిదప విచారింతును. (పోవుచు) ఏమీ——ఏమీ! నాకొకటితోఁచుచున్నది. ఇట్లుచేసిన నెట్లుండును? కాలదేశములన్నియు ననుకూలించినఁజూతము. ఇప్పుడేల యోచింపవలయు. (నిష్క్రమి).

——o——

## ద్వితీయాఙ్కము-ద్వితీయరంగము.

——:0:——

చంద్రరేఖ విడిదియిల్లు.

[ ప్ర: చంద్రరేఖ (పండుకొని) ప్రక్కన తిలక. ]

తిలక—ఈమూఁడుమాసములలో నొకనాఁడైనను గన్నులు తెఱవని సతీమణి నేఁడింత కన్నులు తెఱచె. మరల మూతలువడియె. కొంతసేఁపు పలుకరించినఁ గన్నులువిచ్చె. ఇపుడు రెండుగంటలనుండి యదియు లేకున్నది.

చంద్ర—(పొరలును)

తిలక—(స్వ) కదలుచున్నది. (ప్ర) చంద్రరేఖా! చంద్రరేఖా!

చంద్ర—(కన్నులువిచ్చును).

తిలక—చంద్రరేఖా! నే నెవరెఱుఁగుదువా?

చంద్ర—తిలకా! ఏ మెయిట్లాడెదవు?

తిలక—మాయమ్మ! మాతల్లీ! ఇన్నాళ్లకుమాటాడితివా?

(అనుబంధము 8.)

చంద్ర—ఎంతసేఁపైనదే నేనిద్రపోయి?

తిలక—తల్లిరో! మూఁడునెలలాయెనే నీకీ ప్రపంచజ్ఞానములేక?

చంద్ర—తిలకా! నిజమా? నిజమా? ఇన్నాళ్లేమైనది?

తిలక—అమ్మ! నీచరిత్రమునంతయు సావకాశముగాఁ జెప్పెదను. ఇపుడూరకుండు మాయాసమగును.

చంద్ర—మాయన్న వృత్తాంతమేమి? వినివివనట్లున్నది?

తిలక—పిదపవచింతు నిపుడేమియుఁ దలఁచుకొనకుము.

చంద్ర—(కనులుమూచుకొని) నాకడుపేటికిట్లయినది?

తిల—అమ్మా! రెండుమాసములక్రిందట నీవుప్రసవించితివి.

చంద్ర—ఏమిపిల్ల?

తిలక—ఇప్పుడూరకుండు మంతయుంజెప్పెదను. ఏమియుందలపకుము.

చంద్ర—తిలకా! చెప్పవే—చెప్పవే. ఆభాగ్యమును నాకు లేదుగా?

తిలక—అమ్మా! ఏలదుఃఖించెదవు? నీవుకొడుకుంగంటివి. సౌఖ్యముగనున్నాఁడు.

చంద్ర—మఱియేల మొదటనే చెప్పవైతివి? ఆహా! తెలిసెను కొడుకన్న నావెను కటి కొడుకునుదలంచి దుఃఖింతునని చెప్పకుంటివో? ఏఁడీనాపాపఁడు?

తిలక—అమ్మా! ఆబాలుని చరిత్రము విచిత్రము. పుట్టినప్పుడె సంవత్సరమువానివలె నుండెను. అట్టిగర్భముగనుకనే నీకామూర్ఛరోగము ప్రాప్తించె. పుట్టినపుడు పండ్లుసయితము వచ్చియుండె. మూఁడుదినములకే మెడలునిలిపె. నెలదినములలో నడువసాగె. ఇపుడు రెండునెలలాయెఁగదా? విన్నటినుండి చిట్టిమాటలాడు చున్నాఁడు.

చంద్ర—ఇదేమి విపరీతమో తెలియదు. ఏఁడీ?

తిలక—(తెచ్చియిచ్చును).

చంద్ర—(ముద్దిడి) విపరీతమేటికే? వీఁడుజ్ఞానాధికుఁడు కాఁగలఁడు. పోనీ! కళానిధి వృత్తాంతమేమియుఁ దెలియదా?

తిలక—నీకింత తెలివిగలిగెఁగదా? ఇఁకమీఁదవిచారింతము.

చంద్ర—హా! కళానిధీ! (మూర్ఛిల్లును).

తిలక—అయ్యో! మఱలవచ్చెనే యీపాడమూర్ఛ.

చంద్ర—(లేచి) తిలకా! ఏమియులేదు. అచింతమానితిని. వీఁడే నాకళానిధి.

(అనుబంధము 9.)

తిలక—అమ్మా! మోహముకాని వ్యసనముకాని మిక్కిలి యొనర్పకుము. నీదేహస్థితికి విరోధము.

చంద్ర—మనమిప్పుడెందున్నామే?

తిలక—పుష్కరాగ్రహారముననున్నాము. ఇంకను నిందేయుండవలయు.

చంద్ర—ఎన్ని దినములుండవలయు?

తిలక—నీనాథుఁడిందు వచ్చువఱకు, లేదా మీయన్నవృత్తాంతము తెలియువఱకు. నేనప్పుడే మనవృత్తాంతము నీతివేదిపుత్రుఁడగు మంత్రవంతునకు వ్రాసినజాబున మేధానిధిరాజు మిథిలకువచ్చినవెంటనే యిక్కడికిఁ దెలియఁజేయుమని వ్రాసినాను.

చంద్ర—వీని పేరేమే?

తిలక—నీ నాథుండాజ్ఞ యిచ్చియుండలేదా? విశారదుండని చెప్పియున్నాను.

[ ప్ర: సేవకుండు ]

సేవ—అమ్మా! చంద్రరేఖాదేవీ! మంత్రవంతుడీజాబు మీకుఁబంపియున్నాఁడు.
(జాబిచ్చును).

చంద్ర—తిలకా! ఇందేమున్నదో చదువుము.

తిలక—(చదువును).

తిలకా! నీవు వ్రాసిన జాబు చేరెను. నీ జాబు వచ్చుటకు నాల్గుదినములకు ముందున్నది యున్నట్టు మా శ్వేతకేతురాజుగారి కన్నులు పోయెను. అంతకుఁబూర్వమే నాకు మాతండ్రిగారగు నీతివేదిగారినుండి జాబువచ్చియుండెను. వారు రాజ్యబహిష్కృతులైన పిదప దేవనగరమను గ్రామమునఁ గాపురముచేసిరి. కొన్ని దినములకు శ్వేతకేతురాజుగారివలనఁ బట్టువడి శిరచ్ఛేదనమునకాజ్ఞయీయఁబడియుండిన కళానిధిరాజుగారు దైవవశమున మాతండ్రిగారికి లభించినందున వారు తమయొద్దనే యుంచుకొనియుండిరఁట. ఇప్పటికి మూఁడుదినములక్రిందట సుజల మేధానిధిరాజుగారు మిథిలకు విచ్చేసిరి. వారి యోగాభ్యాసమున నొక్కింత యంతరాయము గలిగినందున సిద్ధపుంగవుఁడు పొమ్మనినాఁడఁట. అయిన నొక పదునాలుగు పదునేను సంవత్సరములు మూఁడామడలో నూరుగలుగని యరణ్యమున సతీసుతులతో నుండి కొన్ని నియమములాచరింపవలయునఁట. అందునకు వారు సర్వసిద్ధులైయున్నారు. ఇదియటులుండనిమ్ము. వారు వచ్చిన వెంటనే గ్రుడ్డిమ్ములఁజూచి పశ్చాత్తాపము కలిగి సిద్ధపుంగవుని యనుగ్రహమున నెఱిఁగిన మూలికాప్రభావమునఁ గన్నుల గలిగించిరి. మీఁదు మిక్కిలి క్షమాగుణైకభావ్యులై శ్వేతకేతురాజుగారికే స్థిరపట్టముగట్టి నెంచియున్నారు. నీవు వ్రాసియున్న విచిత్ర పుత్రజననవృత్తాంతము మీరెందుండుటయు, నీతివేదిగారియొద్ద కళానిధిరాజుగారుండుటయును వృత్తాంతముల నివేదించితి. మాతండ్రిగారికిని గళానిధిరాజుగారికిని బల్లకులు పోయియున్నవి. మీకును బంపియున్నారు. మీరందఱు దైవానుగ్రహమువలన సౌఖ్యముగ నచిరకాలముననే కలియఁగలరు.

ఇట్లు, మంత్రవంతుఁడు.

చంద్ర—ఆహా! ఎంతసుదినము నేఁడు.

(అనుబంధము 10.)

(యవనికపడును).

## ద్వితీయాంకము-తృతీయరంగము.

——:o:——

మేధానిధినగరు.

[ప్ర: కళానిధి-సేవకుఁడు.]

కళా—సేవకా! ఇప్పుడు మా తుప్మ రెంతదూరముననుండును?

సేవ—పాదచారులప్పుడేవచ్చిరి. ఇఁకనొకగడియలో రాఁగలరు.

కళా—మాయయ్య యేటికిఁబోయినారు?

సేవ—రాజకుమారా! ఎదురొకనఁబోయినారు

కళా—నన్నేటికిఁబిలిచుకొనిపోవలేదు?

సేవ—ఇదిగో! వచ్చిరి.

[ప్ర: మేధానిధి, చంద్రరేఖ. (తిలక, విశారదునెత్తుకొని).]

చంద్ర—(కళానిధింగాఁగిలించి) కుమారా! కళానిధీ! ఎన్నిదినములకు నాకులభించితివి!

(కన్నీరునించి)

(అనుబంధము 11.)

మేధా—సతీసుతులారా! ఏటికి నిటుచేసెదరు? విచారుఃఖములన్నియు నేఁడుకడ చనియె. కుమారా! కళానిధి! నీముద్దుతమ్ముఁడు వీనిజననము పరమాద్భుత దాయకము. తిలక సవిస్తరముగాఁజెప్పినది. ఒకసంవత్సరమువాఁడు మూఁడేండ్ల వానివలెనున్నాఁడు. తిలకా! నీవుగదా యింతగారాముగాఁబెంచితివి? సతీమణి! నీవెంతదుఃఖముపాలైతివి! ఇట్టివేళల నినురక్షింపగన్న తిలక ఋణమెన్నిదినములకుఁ దీర్చుకొనవచ్చును?

[ ప్ర: శ్వేతకేతుఁడుదుఃఖముతో. ]

(అనుబంధము 12.)

అమ్మలారో! చంద్రరేఖా శివీ! నాయట్టి ఘోరకర్ముఁడు, కృతఘ్నుఁడు, చండాలుఁడెందైననుండెనే? నను శపించి నాపాపముఁ గడజేయుము.

(అని చరణములపైఁబడును).

చంద్ర—రాజేంద్రా! నీ వేలయిట్లాడెదవు? సమయదోషముకాక వేఱగునా?

మేధా—తమ్ముఁడా! చంద్రరేఖ క్షమించియున్నదిలెమ్ము చింతింపకుము. నీదుర్మంత్రి చేసినపాపముకాక, నీవొనర్చినదికాదు. చంద్రరేఖా! ఇచ్చటికయిదామడల దూరముననున్న యరణ్యమున సిద్ధపుంగవు నాసతిమేరకు శాలలనిర్మింప నుత్తరువిచ్చియున్నాను. మనము తేఁపేపోవలయు. సన్నాహములు చేయవలయును.

(యవనికపడును).

—: ద్వితీయాఙ్కము సమాప్తము :—





# చిరకారి నాటకము.

—————: ૪ :—————

## తృతీయాంకము-ప్రథమరంగము.

———:0:———

(మోహిని యింటిముందటి బయలు.)

[ ప్ర: ఇద్దరు విటులు. ]

1వ విట—అబ్బా! ఎంతాయాసముగానున్నది.

2వ విట—పోవునులే యాయాసమంతయు.

1వ విట—ఈనాఁడు Carriage కొంచెమువిఱిగినది. అబ్బా! ఇప్పుడు తెలిసెను నడువవలెనన్న.

2వ విట—పోనీ! కామసుందరుఁడు నేఁడేమన్నాఁడు?

1వ విట—శంకరుఁడు పోయియున్నాఁడు.

[ ప్ర: అఱచుచుఁ గొలటుఁడు. ]

కొల—నాయనా! నాయనా! నన్ను విడిచివచ్చితివా?

1వ విట—మాయమ్మా! రావమ్మా! నిన్ను విడిచిపత్తునా? (ఎత్తుకొని ముద్దాడును).

2వ విట—ఈయబ్బాయి యెవరు?

1వ విట—(నవ్వి) కుమారుఁడు.

2వ విట—మీకుఁబిల్లలులేరని యనుచుంటిరే?

1వ విట—ఇట్లనే (నవ్వి) కుమారుఁడే.

## తృతీయాఙ్కము-ద్వితీయరంగము.

---o---

హేమనగరము మల్లికాసానియిల్లు.

[ ప్ర: మల్లిక-మోహిని. ]

(మోహినిపాటపాడి ముగింపఁగా).

మల్లిక—మోహినీ! ఇప్పుడింత చక్కఁగఁబాడుదువే, ప్రభువులయెదుట నంతసంకోచించెదవు:

మోహి—మగవాండ్రయెదుటఁ బాడవలెనన్న నాకేమో సిగ్గగుచున్నది.

మల్లిక—అయ్యో! ఇదేమి యుద్యోగమే? భోగముదానికి సిగ్గయిన నింకఁగాఁపుర మెట్లు?

మోహి—అమ్మా! నీవేమైనననుము. నాతలగొట్టినట్లగును.

మల్లిక—అయ్యో! ఎందఱువిటులనో లోఁజేసికొని యొకరికిఁజెప్పినమాట యొకరికిఁ జెప్పక, యొకరినిఁజూచినకంట వేఱొకరినిఁజూడక, యొకరిమార్గము మఱియొకరికిఁ దెలియనీక, వారివారి ధనభాగమంతయు నేనుఁగుమ్రింగినవెలగ పేసమువలె రాఁదీసి, ప్రొద్దునకుఁ బదిసొగసులు, పూటకుఁ బదివలపులు, వేళకుఁ బదియుద్యోగములు చూపి మనఁగల మనకులమునకు సిగ్గనుదయ్యము సోఁకునా? ఇట్టిమాటలింక నాడకుము.

మోహి—అమ్మా! ఎన్నిమాఱులో వచించితిఁగదా? నన్నెవరికైనఁ బెండ్లిచేసియిమ్ము.

మల్లిక—పెండ్లి! పెండ్లియనఁగా నెట్టియౌషధమే? ఊరఁబెండ్లియేనీకు. నాగ్రహచారమున కట్టిబిడ్డవుగలిగితివే! ఇన్నాళ్ళుపెంచినది పెండ్లికా? ఇంతముద్దుచేసినది పెండ్లికా? ఇంతవిద్యనేర్పించినది పెండ్లికా? మంచిపెండ్లి నేర్చికొంటివి.

(అనుబంధము 16.)

మోహి—అయ్యో! గ్రహచారమా.

మల్లిక—గ్రహచారము? నీకేమినొప్పలే గ్రహచారమనుటకు? లినియుండఁబట్టిదో? ఇదిగో! నినుఁబెండ్లిజేసికొనుమగలు వచ్చుచున్నారు. బుద్ధికలిగి చక్కఁగా నడచుకొనుము.

[ ప్ర: నలుగురు విటులు. ]

మల్లిక—(లేచి) దండములండి. రండిదేవరా! (మోహినితో) దండముపెట్టవే నీకేమి రోగము?

మోహి—(దూరముపోయి చేతులుజోడించును).

మల్లి—(ముఖముమోడ్చికొని) రండి. ఇంకనుజిన్నపిల్ల. అనుభవశాలినిగాదు.

విటులు—(కూర్చుందురు).

1వ విట—మల్లికాసానీ! సౌఖ్యమా?

మల్లి—మీదయ.

2వ విట—మోహినీ! రా! కూర్చుండుము. దీనికెన్నియేండ్లు?

మల్లి—ఎక్కడిదండీ! మొన్నటికిఁబదునైదునిండె.

3వ విట—మాగినపండే. భలా! కూర్చుండుముమోహినీ. మల్లికాసానీ! ఏమిచెప్పించియుండలేదో?

మల్లి—(స్వ) చెప్పించి చెప్పించి నాగుంటకూలిపోయినది. (ప్ర) ఏమోపసిబిడ్డండి. ఒకటితెలిసిన నొకటితెలియదు.

4వ విట—నీకేమో పనియుండెనంటివే. పోలేదా?

మల్లి—అవునండి. మఱచితిని. (నవ్వి) (నిష్క్ర).

3వ విట—మోహినీ! దూరమేలపోయెదవు? వచ్చికూర్చుండియొకపాటపాడుము.

మోహిని—అయ్యలారా! ననుహాస్యమాడకుఁడు. నేను సరసురాలఁగాను.

3వ విట—ఇదియెన్నాళ్లుండునులే. నిన్నేమియు ననము. వచ్చి యొకపాటపాడుము.

మోహిని—(కూర్చుండి)

(అనుబంధము 14.)

3వ విట—ఇదిబాగుగాలేదు. మరియొక్కటికానిమ్ము. మంచిపాటపాడుము.

మోహిని— (అనుబంధము 15.)

3వ విట—తాఁకనైనలేదు. ఊరకయిట్లు మోపితిని ఇంతకే మిడిసిపడినది.

మోహి—అక్కా! మోచితివేమే. నీయెదుటనే నన్నీదురాత్ములు పరిభవించెదరు?

4వ విట—ఓయబ్బల్లాలా ఎంతపతివ్రతరాయని!

3వ విట—మల్లికా! సిగ్గెక్కడనా, యిక్కడనాయని యడిగితిని.

మల్లిక—తాఁకనువచ్చితిరగాని కౌఁగిలింపలేదే అందులకని దుఃఖింపుచున్నది.

4వ విట—మాడఁగానున్నది. కొంచెము మార్గముపడినపిమ్మట, ముసుఁగులో మున్నాదుర్గతి మార్చఁగలదు.

మల్లిక—అయ్యో! అంతపుణ్యము నాకున్నదా?

మోహిని—ఛీ! హా! అమ్మ నీవునువారిలోఁజేరితివా?

(అనుబంధము 18.)

(విడిపించుకొని నిష్క్రమి).

మల్లిక—(ముఖము నెపకొట్టుకొనుచు నెటికలు విరుచును).

2వ విట—మల్లికా! దేవాంగనాక్రోఁతిపిల్లను బెంచినట్లేఁన్యాసనినెక్కడఁగంటివే?

1వ విట—ఇదేమి స్త్రీగూ! మాయకమ్మ!

మల్లిక—(3వ విటునితో) ప్రభువా! ఈరాత్రి నీవుమాటయిచ్చినంతధనముఁ గైకొని రమ్ము యోచింపకుము.

3వ విట—తెచ్చి?

మల్లిక—అట్లేటిక? నేనంతయు సరిచేయుదు. నీకొఱకై నిరీక్షించుచుందును.

3వ విట—వేయిమాడలుగదా నీవడిగినది?

మల్లిక—అదిసంతకరవు. తిగ్గారానీచిత్తము నాభాగ్యము. దానికేమి. ఇంకొక వేయి తెచ్చిన నీకుఁదక్కువగునా?

3వ విట—మిత్రులారా! పోదము. (విటులు నిష్క్రమి).

మల్లిక— కం॥ ఎంతైనఁగాని నేఁడీ।
యింతింటెఱనట్టి చెలుతు నేఁడిఁబడనా।
వంతైనఁగష్టముండదు।
అంతవిటునకుదీనిగర్వమణఁగదిఁ కేలా॥ (నిష్క్ర).

# తృతీయాఙ్కము-తృతీయరంగము.

———:0:———

## మోహినిపడకటిల్లు.

[ ప్ర: మోహిని (శృంగారింపఁజేయించుకొని). ]

మోహి—(మల్లికపెట్టియుండిన పడకటింటిదీపములఁ గొన్నింటినార్పి) మవసా! భీతిల్లకుము. ప్రాణమునకువచ్చినపుడు నీవెక్కడ వెనుదీయుదువో? నీధైర్యమునమ్మియున్నాను. ఏదోయొక దురుద్దేశమున నీదీపసమితి వెలిఁగింపఁబడియెఁగాని వేఱుకాదు.

ఉ॥ చూపకు జారజారిణులుఁజోరులు మిమ్మును దేఱిచూడఁగా।
నోపరు మీరలుండినను నుత్కటభీతివహించి తీసి యా।
యాపనులఁ ఘటింతు రిపు డన్నను నా కగుదుష్టకృత్య మో।
దీపములార మీరు తరితీపునఁజూడఁగ నిచ్ఛయింతు రే॥

దీపములారా! మీరిట్టి నీచకృత్యమును జూచెదరా? వ్యభిచరించువారు, మిముఁ గంటినెరసుగాభావించి, మీకుండరాములుగలిగింతురే. నేఁడు నాకొనర్పఁబోవు దుష్కృతికిసాక్షిభూతులుగానునుపఁబడితిరే? నేనుమిమ్ముండనీయను. (అన్నియునార్పి) హరీ! జలజేక్షణా! నిన్నేనమ్మియున్నదాన. నాకుమానభంగము గలిగించితివేని, నీసాక్షిగా నాత్మహత్యఁజేసికొందు.

(అనుబంధము 19.)

(లోనికిఁబోయిఁ బండుకొనును).

[ ప్ర: శేవ విటుఁడు మనోహరుఁడు. ]

విట—ఆహా ! ఒకసంవత్సరమున కొన్నిగంటలున్నవో యందఱుసానులతో సహవాసము చేసినాఁడ. ఇట్లయినను నీమోహినియెడకుఁబోవుటకు మనసు బెగడొందుచున్నది. అయిన నీనవోఢాప్రథమసంగమ సుకృతమెవ్వరికి లభింపనలయు ?

(వాకిలి మెల్లఁగ దెఱచిచూచి ఆశ్చర్యమునభినయించి)

శా॥ ఈరామామణిముద్దుమోముగనుటే యేకాధిపత్యంబగుఙ్ ।
నారీరత్నముముద్దుగొన్నయపుడే నాకాధిపత్యంబగుఙ్ ।
నీరేజేక్షణకౌఁగిలింపఁగనిన స్త్రీవిష్ణుభోగంబుగా ।
దోరమ్యాంగియనంగకేళివెలయెంతో చెప్పఁగాశక్యమే ॥

ఆహా ! ఏమీసుందరి సౌందర్యము ?

(అనుబంధము 19.)

దీని ముద్దుగారుమోము విటులముద్దులకాకర్షణమంత్రము గానున్నది. దీనిబొమలను మరుపిండ్లఁగాంచిన నెట్టిభుజంగుఁడును భ్రమింపకున్నే? అందుఁ జూపుటమ్ము లెక్కు-వెట్టి విటహృదయములఁ గాడనే యుళింబరారికిఁ జోహారులిడనివాఁడెవఁడు ?

సీ॥ పూర్ణేందుబింబంబుపోవమ్మ నెపుడీనిమోము
మోమునఁజేర్చి మొనయనలదె ।
రహిబింబఫలకాంతిరారమ్మ నెపు
దీనికెమ్మోవిసుధలాని కెరలవలదె ।
లికుచఫలమ్ములలేలెమ్మ నెపు
దీనియుదుటుగుబ్బలగోరులుంచవలదె ।
తెలివిబంగరుచాయతేతెమ్మ నెపుదీని
నెమ్మేనుకౌఁగిటనింపవలదె ।

తే॥ గీ॥ మేలుటద్దాలజగడాలుచాలుజాలు।
ననెపుసీకాంతచెక్కులనతిశయిల్ల ।
మదనసామ్రాజ్యమై భవంబొదవినట్లు।
లేఁడుమీాఁదన తమినిముద్దాడవలదె॥

ఇప్పుడుపోయి తొలిముద్దుఁగైకొందుఁగాక. (సమీాపింప).

మోహిని—(భయమునలేచి) ఎవరు?

మనో—తరుణీ! నీచూపుగములకోడి, నీముద్దుమోము చూడవేఁడి, బిగుమానమువీడి దాసానుదాసుఁడనైన మనోహరుఁడఁగదా?

తే॥ గీ॥ రమణివాలారు నీచూపుగములకోడి।
సొలసినీమోముదమ్మిని జూడవేఁడి।
పెల్లుతమివాఁడిబిగుమానమెల్లవీడి॥
యుఁడరునీదానుఁడను మనోహరుఁడఁగాదె॥

మోహిని—ఆర్యా! సర్వవిదుఁడవైన నీకు వనితల యంతరంగస్థలముల ఛేదించిచొచ్చుట ధర్మమా?

మనో—అందుకైకదా యింతపాటుపడితి. నన్నేల దూరపుచూపుచూచెదు? రూపమున, విభవమున, జ్ఞానమున, నేనేమిటఁదక్కువ?

మోహిని—కావుననే యిట్టియాగడ మొనర్చుట పాడియాయని విన్నవింతు. ఆఁడువాంఛ్రదందలొక్కటియేగదా? వారిమర్యాదల వెలిబుచ్చుట మానిసిపాడియా?

కం॥ జ్ఞానంబుననుగుణంబున।
మానితుఁడవుగానధర్మమా దూరగన।
బ్జాననలపడకటెంటన।
సీనముగాననుచువిన్నవించెదుదానన్॥

మనో—కామినీ! నీవు వెలయాలవై యాఁడువాంఛ్రదందటిలోనేల నినుఁగూర్చుకొని యెదు?

మోహిని—పురుషపుంగవా! నను వెలయాలంటివిగదా? జన్మమున నా, వృత్తివలన నా నాకు వెలయాలితెనము?

మనో—జన్మమున నన్న?

మోహిని—అదియెన్నఁటికైననగునా? జన్మమున వెలయెక్కడ నాలెక్కడ? ఈ జాతినిజనించిన మగవాండ్రయినవారు లేరా?

మనో—పోనీ! వృత్తివలననే కానీ!

మోహిని—నేనావృత్తినవలంబింపలేదు. వెలయాలనెట్లగుదు?

మనో—నీవేమి పెండ్లిచేసుకోనను న్నావా?

మోహిని—అందునకేమైనఁగాలమువిూ రెనా?

మనో—మనసురాక మాటలాడెదవు నీయందుఁ బెండ్లిచేసుకొను లక్షణము లైనను న్నవా? నేఁడుగాకున్న తేఁపైన నేను గాకున్న మఱియొక్కఁడైన నీయనంగసుఖము ననుభవింపుమవాఁడు, నేఁదాళఁజాల. రమ్మా ననుఁబొందు. ఇమ్మా నీకౌఁగిలి. (సమీపించి)

(అనుబంధము 20.)

మోహిని—పురుషచంద్రమా! ఇటు నాకడకువచ్చుట మేరగాదు. ఒక్కటియడుగుదును. నను నీవుపొందగోరునది మోహముననా కామమున నా?

మనో—నేఁడేమి క్రొత్తమాటలవింటిని. మోహమునకు కామమునకుఁ భేదముగలదా?

మోహిని—ఎఱుకలేనితనమునఁ మోహమును గామమును బర్యాయపదములుగా భావింతురుకాని మనశ్శుద్ధత్వమునఁ బుట్టితిరుగుటకు దాతలేక యాజన్మమునుండఁగల ప్రేమాతిశయము మోహమనియుఁ, దత్కాలమున దర్శనశ్రవణాదులవలనఁగలిగి తుచ్ఛేంద్రియ తృప్తిఁగన్న వెంటనే నశించునది కామమనియు నాయభిప్రాయము.

మనో—(స్వ) ఔరా! ఈనారిపలుకులు! ముద్దులగులుకు చున్నవి. (ప్ర) అతివా! మోహమున నే నినుఁగోరుట నీకంటె మోహింపదగిన భామామణియుండునా?

మోహి—సత్యమా! ఐన ననుఁబరిణయముగుటకు నేసమ్మతించిన నీవియ్యకొందువా?

మనో—పరిణయము? పరిణయము? భోగముదానిఁ బెండ్లియాడువిధియా నాకు?

మోహి—అయిననిది నేనునిర్వచించిన మోహముకాదుగదా?

మనో—మోహమునఁ గాకున్న కామమున నే కానిమ్ము. కామమునఁగాకున్న క్రోధమున, లోభమున, మదమున, దయ్యమున, భూతమున దేనసైనఁగానిమ్ము. ననురతికేళి నోలలాడించినఁజాలు.

మోహి—పురుషసింహా! కామమునకు ఫలితార్థము క్షణికతృప్తియేకదా? ఆతృప్తి యయినను ననురాగమునంగదా కలుగును? నాకనురాగములేకున్న నీకేటితృప్తి. కావున ననుమానుము.

మనో—నినుమానుటకా యిన్నిమాటలు? అవితప్ప వేఱేదైన నడుగుము. నాధనము, నాభూమి, నాదేహము నాప్రాణమునైన నడుగుము. రమ్మా సంశయింపకుము.

కం॥ అడుగుము నాధనసంచయ।
మడుగుము నావైభవంబు. నడుగుము దేహం।
బడుగుము నాప్రాణంబుల।
విడిచెద నీకొఱకు నిన్ను విడువలతాంగీ॥

మోహిని—అన్నా! ఎఱిగి యెఱింగి నీకీయవివేకమేల? క్షణిక నీచతృప్తి కీర్తి మూలమా? ఇహమున సౌఖ్యమా? పరమునకు మార్గమా? ఏటికీమగ్నత?

సీ॥ అనురాగమెఱుఁగని వనజాతముఖి యెడఁ
బోరి భలవంతంబు బోలదన్న।
క్షణికమై వెలయు నీచపుతృప్తి యగుఁగాక
సౌఖ్యమించుకయుండఁజాలదన్న।
దుడుకున నెదేని దుష్కార్యమొనరింప
నిల్లోకమునఁగీర్తి యొసఁగదన్న।
సన్మార్గగరిమ సంచలనంబు నొందింగ
బరలోకమార్గంబు పరగదన్న।
తే॥ నెలతలఁగలంపఁ బుణ్యంబు దలఁగునన్న।
అన్యసేయుఁగ వినువారు నవ్వరన్న।
చెలఁగి ధరనెల్ల నపకీర్తి గలుగదన్న।
కనికరంబున నామాట వినఁగదన్న॥

మనో—మగ్నతమో నగ్నతయో, తరుణీ! నీవేమన్న నుమానను. ఒకముద్దయినఁ గొనక విడువను.

మోహిని—అయ్యా? నీకుఁదల్లితోఁబుట్టువులు లేరా! వారివలె నన్నుఁదలంపుము.

మనో—కామిని! నాతల్లితోఁబుట్టువుల సాటియేటికి? సంసారులై ప్రతివ్రతలై యున్న వారికిని వెలయాలవై లోకపత్నివై యున్న నీకును స్వర్గమునకు నరకమునకున్నంత దూరము. ఊరక మాటలాడనిచ్చిన నీవుమాటలాడెదవా? బలిమినైన నినుమానను. నీవేమి చేయగలవు? ఊరకశయనింపరమ్ము. (చేపట్టు).

మోహి—(విదలించుకొని) (అనుబంధము 21).

అయ్యా! వలవనిపరవనితల నక్కచెల్లెండ్రకంటె హెచ్చుగాభావింపుము.

మనో—పరవనితలు? పరవనితలని నీవే ద్చెదవు నీవెక్కడిపరవనితవు? రొక్కమిచ్చి యిష్టపడినవారికెల్ల స్వవనితవు. భోగముదానితో నీతులువినవలసివచ్చెఁగా నా ప్రాప్తి?

మోహి—అయ్యా! భోగమువారికిఁ బుట్టినమాత్రమున నీతులు నుడువరాదా? అవి నీకేమి తెలియని నీతులా?

సీ॥ వేశ్యచేనీతులువిననాయెనంటివి
  నీకేమి తెలియనినీతులయ్యా।
దుడుకుననాకునీవెడరుగల్గించిన
  నేనీతిఁజెందుటనిక్కమయ్యా।
ఘనదర్పమై యింతయునపరాధ మెఱుఁగని
  పడఁతిఁజూపఁగనీకు భావ్యమయ్యా।
యీపాప మెఱుఁగకయీమెలనాగ యున్న
  శాంభవసూరికి పోపదయ్యా।

తే॥ గీ॥ వెలయతోఁబుట్టువులునీకుఁగలుగరయ్యా।
కుందఁజేసెను కార్పణ్యమెందుకయ్యా।
ప్రాణదానమొసంగికాపాడుమయ్యా।
మెచ్చినాతండ్రినామ్రొక్కుఁగాంచవయ్యా॥

(అనుబంధము 22.)

(నమస్కరించును).

యిపుడొక నిమిషమునకుఁ బ్రాలుమాలెదవే? ఈలోకము నందలిమగణముతో సుఖదుఃఖములన్నియుఁ దీరెననుకొందువా? ఇక్కడి కార్యాకార్యముల విమర్శించి బహుమానదండనాదులొసగుటకు యముఁడున్నాఁడే? తత్కాలమున నుద్భవించిన బుద్ధిమాంద్యమున నీవు తెలియఁజాలకున్న నీకంటె కఠినాత్ముఁడుగా యముఁడు? వాడు నీకేమి తోఁబుట్టువా? నినుమానునా? అయ్యో! స్వవనితయని విలపింతువే? స్వవనితయైనను సమయమెఱుఁగక సమ్మతివడయక కూడుపతి చండాలుఁడనిపించుకొనఁడా? నీకంటెభిన్నమైన స్వవనితపై నీకధికారమున్న యీవనితకుఁ దనతోడి నీడబాయకుండ శరీరము స్వాతంత్ర్యములేదా? తల్లియనక తోఁడఁబుట్టువనక కలయు పశుమృగాదులు సహితము సమ్మతిగొనక పొందగోరునే? అన్నరో! నీవేమైన దుష్కృతియొనర్చిన నీయెడనే నాప్రాణానిలముఁబాయుదు. అప్పుడు దుష్టవేశ్యావృత్తిమాని శిష్టసతీవృత్తి నవలంబింప నుత్సహించి యే పాపము నెఱుఁగని పడతియుసురు నిన్నూరకపోవనిచ్చునే? క్షమాగుణమొందును బూజనీయము. క్షమచే శరణాగతుల రక్షించుట మఱియు భావ్యము. నేను నీచేఁజిక్కినదానను. నినుశరణొందినదానను. నీవు ననుఁజెనకుటనను జంపుటయే. మానదానమును, నామూలమున ప్రాణభిక్షమును వేఁడుదానను. నాకుఁ బ్రాణమిచ్చి తండ్రియనిపించుకొని కీర్తిగైకొందువో, మానభంగమొనర్చి ప్రాణములఁ బోకార్చి నాపాలిటి కటికి పగదాయ యమకింకరుఁడనిపించుకొందువో యెఱుఁగను నావ్రాతలు నేఁడు నీచేనున్నది. బ్రహ్మవ్రాయఁడు. నీవువ్రాయఁగలవు. అన్నా! ఇదిమాటికి ముమ్మాటికి సత్యము. రక్షింపుము. రక్షింపుము. రక్షింపుము.

(యని నమస్కరించును).

మనో—(స్వ) ఆహా! ఈకలికిపలుకు లెంతసకరుణముగానున్నవి ఎంతనామానసమును కరఁగించెను? అమ్మా! లెమ్ము,

సీ॥ తోయజాయతనేత్రి నీయుపన్యాసంబు
కటికిమానసమైన కరఁచునమ్మ!
కడుపుణ్యమహిమంబుగలుగునంగ
నవునీవెట్లు వేశ్యాజాతిఁబుట్టితమ్మ!

వెలఁగూలివలపులఁగులుకులమాని
　　యీనీతులనెన్నఁడునేర్చితమ్మ।
కలనైనశుద్ధవృత్తులనెఱుఁగనినీకు
　　ఘనసతీగుణమెందుఁగలిగెనమ్మ।

తే॥ గీ॥ నాఁటినాకీవుగురుభూతవైతివమ్మ।
వాసిమంత్రోపదేశంబు జేసితమ్మ।
నెమ్మినానేరములనుమన్నింపవమ్మ।
శాంతిమయినీకిదెనమస్కరింతునమ్మ॥

నేనుద్రోహిని. చండాలుఁడను. చదువుచట్టుబండలెన్ని నేర్చియు నింతయర్థము గ్రహింపనైతి. ఇపుడునమస్కరించుట నావంతు, సర్వాపరాధముల క్షమింపుము. (నమస్కరించి) పూజ్యుడగు నుత్తమవంశమున జనింపగల నీవు పూర్వజన్మమునఁ జేసిన యేతపోవైఫల్యముననో యేశాపవైకల్యముననో చొరరాని యీనీచజాతిని జనించితివి. జనియించినమాత్రమున బహుజన్మతపః పరిపాకఫలమునఁ గలిగిన సద్గుణ మెన్నటికైనఁబోవునా? నాకుబుద్ధిగఱపితివి. నీవుమాతల్లివి. నీపాదములయాన, నాయాన, యీపరమేశునాన నేఁడాదిగాఁ బరసతీసంగమవాంఛ సన్యసించితిని. ఈబీజమంత్రమును నీవయుపదేశించితివి. నాకానతిమ్ము. పోయివత్తును. నే నిను మరల సేవింతును.

(అనుబంధము 23.)

(ముందరి యవనికపడును.)

[ప్ర: మల్లిక.]

మల్లిక—(మనోహరుని కెదురుపడి చేపట్టినిలిపి) కాయా? పండా?

మనో—మల్లికా! నేనొకటియడుగుదును. ప్రమాణపూర్వకముగ నుత్తరమొసంగుము.

మల్లిక—అదియేమి?

మనో—నీవీబిడ్డనే మహాపురుషునికిఁగంటివి?

మల్లిక — అదియు నెందుకు? అనుకూలమాయెనా లేదా?

మనో — ఆ తల్లివిషయమై యింక నీమాటలాడకుము.

మల్లిక — (ఏడకొట్టుకొని) అయ్యో! అయ్యో! ప్రభువా! కొంచెము నిలువుము. నా బిడ్డనుండను వేడుకొని ప్రార్థించి తిట్టికొట్టి చంపినను నీకనుకూలపఱచెదను.

మనో — ఆమాటలింక నాడకుము. ఆమె మీతల్లి.

మల్లి — మీతల్లి ముండమూసిరండీ నాకొంపపాడాయెను.

మనో — ఏల దుఃఖింతువు? ఇంత సద్గుణసంపత్తి గలబిడ్డ నీకుండుటకు సంతోషింపవలయుఁ గాక —

మల్లి — అయ్యో! సంతోషమా? అయ్యో! సంతోషమా! దీనిపాడెగట్ట. దీని పుటము వేయా! ననుముంచెనే?

మనో — మల్లికా! ఊరక ప్రేలకుము. నేనడిగిన ప్రశ్నమునకుత్తరమిమ్ము.

మల్లిక — మీ ప్రశ్నమేమండీ? కడుపుకాలి చచ్చుచున్నాను. నానోట గరకాయ వేసును. అయ్యో! ఎంత ద్రవ్యమిచ్చితిరండీ!

మనో — నా ద్రవ్యమేమి వెనుక కిచ్చెదవా? ఆ ద్రవ్యమా నేను దీసికోవలయును? ఈబుద్ధి గలుగుటకంత కాకింకబడియంతలిచ్చినను దక్కవయే. నాకుత్తరమిమ్ము.

మల్లిక — (కన్నులు తుడుచుకొని) ఏమడిగితిరండీ?

మనో — నీవీ చిన్నదాని నేమహాత్మునకు గంటివి.

మల్లిక — మీ కెందుకది.

మనో — నాకు ముఖ్యముగాఁ గావలయును. నీ వేమడిగిన నిచ్చెద. చెప్పుము.

మల్లిక — నేను గనలేదండి.

మనో — సాఁకినకూఁతురా? కన్నకూఁతుగని చెప్పుచున్నావు.

మల్లిక — చెప్పవలయునా?

మనో — నీతోడు. చెప్పవలయు.

మల్లిక — ఇరువది సంవత్సరముల క్రిందటఁ గొందఱు కాటిపాపలతో నెక్కడనైన నొక చిన్నదానిని తెచ్చియిమ్మనియంటి. తర్వాత నాలుగైదు వత్సరములకు నేనే గర్భవతినై యాఁడుశిశువును బ్రసవించితి. ఆశిశువు పుట్టినవెంటనే మృతిఁబొందెను. ఆతరుణముననే పదిదినముల యొక స్త్రీశిశువుం దెచ్చి యమ్మఁజూపిరి. అదిమిగుల రూపవతియగుటచే దానియెత్తువరహాలకు దానింగొని సకలవిద్యలనేర్పి యిల్లాకా భంగముఁ గలిగించుకొంటి. ఇదియే దీనిచరిత్రము.

మనో—ఇది యెవరిబిడ్డ యగుటయుఁ గాటిపాపలు చెప్పరా?

మల్లిక—వారెఱుఁగరఁట. ఎక్కడనో చచ్చిపడినట్లుండెనఁట. అప్పుడే ప్రాణము వచ్చిన సద్యోజాతయఁట. నాకొంచెపుగూళ్ళఁగదా దీనికి ప్రాణములువచ్చినవి?

మనో—మల్లికా! ఇప్పుడు తెలిసెను. ఈమె సద్వంశమున జనించినదిగా నుండెనూపు. ఈమెవిషయమై మాటలాడవలసిన సంగతులు విశేషముగానున్నవి. ఇప్పుడర్ధరాత్రము మీరినది. సెలవుకొందును.

మల్లిక—పోయి నాయమును దీరఁగసి దీర్చుకొందును. (నిష్క్ర—)

[ప్ర: శీఘ్రముగమనమున నలుగురు విటులు.]

1వ విట—Success? Success? (Shake hand)

మనో—మిత్రులారా! ఊరకుండుఁడు. నేను మొదటి మనోహరుఁడఁగాను.

1వ విట—What is this ఓహో! అంతటి happiness కలిగినదా?

మనో—అవును. మహానందకరముగు నీతిపట్టునడినది.

1వ విట—Talk of నీతి in a D G's house! ఏమిటిది?

మనో—సోదరులారా! కూర్చుండుఁడు. మొదటినుండి మీరు కీడునకు మేలునకునెల్ల నాయనుచరులై యుంటిరి. ఇప్పుడును, నా యుపదేశము వినుఁడు. ఈ మహాతల్లియగు మోహిని నాకుపదేశకర్త్రియై నన్నుద్ధరించె. నేఁటినుండి మనమందఱము వనితాంతరేచ్ఛను సన్న్యసింపవలయును. వేశ్యాప్రసంగము దలఁచుకొననైనరాదు.

1వ విట—ఏమిది?

మనో—ఇదియిట్లనే. అపకీర్తి యొకటి. పాప మొకటి. చెప్పరాని యనుతాప మొకటి. ధనహాని యొకటి. దేహహాని యొకటి. గృహసుఖభంగకర నరక మొకటి. కాఁబట్టి యాగా యిచ్ఛ మన మానసమున నింతనుండి విడవలయును. మనము దృఢమానసమున బట్టుపట్టిన, నిది యసాధ్యము కాదు.

1వ విట—ఇదేసుమాట మనమంత discussions చేసి యుండవలెనా కానిండు?

మనో—అదియంతయుఁ బొరపాటు. దీర్ఘముగా నాలోచించిన మనవాదము కుంటివాద మనుట స్పష్టమగుచున్నది. నేనంతయు సవిస్తరముగా వచించెదను. పోదము రండు.

కాము—నేను నాఁడే చెప్పలేదా? నావాదమే గెలిచె.

అందఱు — మాకింకవాదమేల? నీవు మోహినిగురువైన, మాకు నీవేగురువు, నీదారి యెట్లో మాదారియట్లే.

(అందఱు హరిభక్త వేషధారులై మనోహరునికి నమస్కరింతురు).

(అనుబంధము 16.)

(నిష్క్రమింతురు.)

(వెనుక యవనికనెత్తగా యదేపడకటింట మోహిని ఆలోచించుచుఁ గూర్చునియుండును)

[ ప్ర: మల్లిక (రభసమున). ]

మల్లిక — (ప్రవేశించి) అయ్యో! ఎంతగయ్యాళివే? ఎంతటి రంపెలాఁడివే? ఎంత మాయకారివే? నాకులమున కపకీర్తిఁదెచ్చుటకు జనించితివే. నాయిల్లు పాడుచేసితివిగదే! ఏమి పతివ్రతమువలె నటింపుచుంటివి కానున్నావే? నానీతులన్నియు గాలికి పోవఁగొట్టితివిగదే? సరసవిద్యల గోదావరిపాలు జేసితివిగదే? ఈసూచనకొంత తెలిసియున్న నప్పుడే నినుగుత్తకపిసికి చంపుచుంటినే? నాద్రవ్యము నాకుఁదక్కుచుండెనే! ఎంతపాడైతి! ఎంతమోసపోయితి! నిన్నిప్పుడు విడుతునా? నినుఁజేఁగాలు గట్టి చండాలుల దోలనా! (సమీపించును).

మోహి — (తప్పి పోవలబోయి) నన్నేమియు ననకుము. నాయిచ్చచొప్పనఁబోనిమ్ము. లేకున్న నేనెందైన బావిఁజూచుకొందు.

మల్లిక — నీవు మాచుకోనేల? నేనే చూపుదనమ్మ. అప్పుడు నిశ్చింతగానుండెదను.

(అనుబంధము 24.)

(పట్టి బజికి కొజికి కొట్టును).

మోహి — మల్లికా! నీదుశ్శీలము మానుము. నీవా మనోహరుఁడను విటునితోఁ జెప్పినమాటలన్నియు నిందేయున్నయటుల విధిలేక వింటిని. నీదుష్ప్రవృత్తియంతయు నెఱింగితి నీవెప్పుడైన బలాత్కారముఁ జేయుదువని నమ్మి యప్పుడు నాప్రాణమును గడతేర్చుకొనుటకు సాధనముగా నుంచుకొన్న యీకటారి (పమిటక్రిందనున్న కటారిఁదీసి) మనయిద్దఱ ప్రాణములఁ గొనసాగింపఁగలదని నమ్ముము.

(మెఱయించును).

మల్లిక—అన్నోయ్యో! అన్నోయ్యో! (ఎదమోదుకొని క్రిందఁబడిమూర్ఛిలుచు)

మోహి—ఈదురాత్మురాలియింటఁ నేనుండఁజన్ను నాతలిదండ్రుల నెఱికికొనుచు నెందేనియుంబోయెద. (పోవుచు తిరిగి) ఆహా! ఈదుష్కర్మురాలి సొమ్ములు చీరలు నాకేటికి?

(అనుబంధము 25.)

(నిష్క్రమింతురు).

—: తృతీయాఙ్కము సమాప్తము. :—

—:o:—

శ్రీ

# చిరకారినాటకము.

—:o:—

## తురీయాఙ్కము-ప్రథమరంగము.

అడవి.

[ప్ర. కొఱిచెవారు.]

1వ కొం:చె—హరోఖైరే! చేసుకోనేకివద్రాదు

2వ కొం:చె—నీకున్నా! ఓగన్యో! బలువాడేఁ నీకునాకుదోగాం.

3వ కొం:చె—నీయహా- ఏమిగోత్యెబాము. దఁపెలాశ నేనాదొతాందే

4వ కొం:చె—బూతుగుంటే నీవుఫ్లేదే నేనూఫ్లేడె. తేరాదోడు.

అందఱు— (అనుబంధము 26.)

(ప్రక్కకుఁబోయెదరు).

[ప్ర: మోహిని బీదవేషమున.]

మోహి— (అనుబంధము 27.)

ఆహా! నాదౌర్భాగ్యమున కేమందును? నాల్గుదినములనుండి యాహారములేక కుందుచున్నానే? విచారించువారు లేరుగదా? ఎవరునూచిన నుల్లసములాడి దుష్క్రియయుద్యమించువారుగాక పాపమనువారులేరే.

(అనుబంధము 27a.)

దైవమా! నాకేల యీరూపము నిచ్చితివి? ఈరూపమునకై కదా మల్లిక నాపాలఁగు ధనమునకు నమ్ముకొన్నది? ఈరూపమునకై కదా యెంత అందమో విటులు దాని వాఁత ధనసంచయముఁ గొట్టినది? ఈరూపమునకై కదా నాకెందరో లమిచ్చువారు లేకుండినది? ఇంతదౌర్భాగ్యమునకు మూలమగు నీరూపము నాకేటికి? ఇంత దుష్ప్రాప్తికి హేతువగు నీరూపము నాకేటికి? దైవమా! తుదకు నన్నింగతికిఁ దెచ్చితివా! నరకపాథేయమగు దుష్కృత్యమునకుఁ దప్పించిన నాకిట్టి యాపదఁ దెత్తువ? పాముకాటునకుఁ దప్పించి పులివాతకప్పగించినట్లుచేసితివే! కటకటా! మూఁడుదినములనుండి తినుటకున్నను నియమమున్నను నిగ్రహించుమార్గముఁ గానఁగదా? నడయాడుటకు శక్తిచాలక కన్నులుమూసికొని వచ్చుచున్నవి. ఎన్ని సంకటములనుభవించినను నొక్కంతాఁకలిఁదియ్యవాఁడు లేఁడే

(అనుబంధము 27b.)

మరలఁబోయి యామల్లిక శరణొందవలయునా? పొందియభిమానమువిడిచి సుకృత్యము మాని దుష్కృత్యముఁబూని యశోహానిఁజెందవలయునా? మార్గమేమున్నది? ఆమల్లికఁ గాక యింకొకయ నను బోషించువారెవరు? ఈలోకమున నింతటికీడుకల్గునే? సన్మార్గమున మనవలెనన్న నింతయంతరాయము రాఁదగునే? లేదేని శరీరము విక్రయింపవలయు లేదేని కూడులేక చావవలయునను భంగి కలుగునే! ఎంత యశోహానికైన నోర్వఁగాక యీయాఁకలిబాధకోర్వఁగలనా? ఎట్లయిననుజేసి మరల మల్లికయొద్దకే పోయెద. (పోవఁబోయి తిరిగి) ఆహా! మిన్నువిరిగి మైఁబడినను, ప్రాణానిలము వాసిపోయినను, నవయవములు పడిపోయినను, నాకలిచేఁ జచ్చినను మరల నాపాపకంటకము, నాకలుషమూలకందము, నా యన్యాయములదీవి, నాపంకములబావి, నాదుష్కృత్యములమునికి, నాదుష్కృత వైదములయునికి, నా క్రూరకృత్యములప్రోవు, నాకరుణలేనితావు, నాయేవపుతావుఁ దిరిగిమాతు నా నిక్కడనైన మడిసెదఁగాక— (కూర్చుండును).

(కొరిచెలు ముందటికివచ్చి).

1వ కొరిచె—ఓరక్షీ ఆపండిందిరారా! అపండిందిరారా!

విశా— (అనుబంధము 29.)

( [illegible] )

మోహిని—(ఆయాసముతో) మహాపురుషా! నాకు ప్రాణదానమొసంగి రక్షించితివి.

విశా—తరుణీ! నీ వెవ్వరవు? ఏకాంతమున నేకతమున నిట్లు వచ్చితివి.

(అనుబంధము 30)

మోహిని—అయ్యా! నేను మోహినియను పేరిదానను. అమ్మో! అమ్మో! (నోరు చూపి మూర్ఛిల్లును).

విశా—ఈతరుణికి దాహబాధయో క్షుద్బాధయో కలిగియున్నది. ఎత్తుకొనిపోయి యుపచారముచేయుదుగాక. (నిష్క్రాం.)

—o—

## తురీయాంకము-ద్వితీయరంగము.

మేధానిధి యిల్లు.

[ప్ర. మోహిని.]

మోహిని—నాభాగ్యమునకు సమానములేదు. ఇదియే నాదుష్కాలమున కంత్యమైనటులఁ దోఁచుచున్నది. ఈమేధానిధి రాజర్షియుఁ జంద్రరేఖాదేవియు మాతల్లిదండ్రులకంటె నెక్కువగా నన్నుఁజూచుచున్నారు. వీరియొద్దఁజేరి యెనిమిదిమాసములాయెగదా? పుట్టిననాటినుండి వీరింటనుండిన నెట్లో యట్లు నాకున్నది. వీరి "నయ్యా! అమ్మా" యని యేకవచనమునఁ బిలుచుచున్నాను. అంతచనవైతిని. ఈ చంద్రరేఖాదేవి పయింబక్కంబడుచు నేమేమో హాస్యములాడుచుండును. ఎంత చేసినను నవ్వుచుండుఁగాక యొక్కమాటనదు. అన్నిటికంటె నెక్కువగా మరియొక సంతోషము. నేను నాజననాదుల నేమియుఁదాఁచలేదు. ఉన్నమాట నిక్కముగాఁ

చెప్పితిని. ఇట్లయినను నించుకైన భేదమొందక నన్నుఁజూచుకొనుచువచ్చెదరు. అజ్ఞానమున నేమొనర్చినను దోషము కాదనియు నేనున్నత వంశమునఁ జనించియుండవలయుననియు నన్నాగార్చి మాతల్లిదండ్రుల నరయుటకు బ్రాహ్మణులనయితే పంపియున్నారు. తల్లిదండ్రుల నెఱుఁగకున్న పరదేశికిఁ జంద్రరేఖా మేధావినులు తలిదండ్రులైరి. పాపము పుణ్యమనువాటి నెఱుఁగకున్న నిర్భాగ్యురాలికిఁ బాపమనువారు నేఁడిందుఁగలిగిరి. రమ్మని పిలుచువార లరయకున్న యనాథకు రమ్మని పిలుచువారు నేఁడేర్పడిరి. ఇన్నినాళ్లకు దైవమునకు నాపైఁగరుణ కలిగెఁగాఁబోలు. ఇంతసంతోషము నామనసునకెందుఁగలిగె.

(అనుబంధము 31.)

అయిన నొకటిమాత్రము చింతనీయము. దానివలన నాకున్న యీసంతసమంతయు నంతమొందునోయను భీతిగలిగెను. ఈరాజకుమారులు, కళానిధి విశారదులు నన్నుఁజూచుటచేతఁ గొంచము సంశయాస్పదముగానున్నది. ఆయువపురుషుడు నన్నుఁ బ్రేమంపుఁజూపునఁ జూచెదరు. కళానిధిని గన్నమాత్రనే, కడుపున చెయ్యివెట్టి కలంచినట్లుసంకటమును, మనసున దిగులును నాకుఁగలిగెను. ఏమిదైవాయత్తమో విశారదునిఁ జూచిన మరలఁజూడవలయునను వాంఛగలుగుచున్నది. నాకతఁడు ప్రాణదానమిచ్చినందువలననే యుండునా? ఛీ! రాజకుమారుండగు నతనికిని వేశ్యపంచఁ బెంచఁబడిన నాపయి నెక్కడితలంపు గల్గును.

[ప్ర: కళానిధి]

కళా—మోహినీ! అదేమి యింతొంటిగానున్నావు?

మోహి—అయ్యా! కళానిధీ! ఏమియులే దూరకయున్నాను.

కళా—ఏమో యోచించుచున్నట్లున్నది.

మోహి—అదియునూరకయే.

కళా—పనిలేని పనిగా నూరక యోచనసేయుదురా? నాకుఁజెప్పుము.

మోహి—నాకేమియోచనగలదు? మీరు తలిదండ్రులుండఁగా నేమియోచన? వేశ్య యింటనుండిన నన్నింతగాఁ బెంచితిరిగా యనియే యోచన.

కళా—దీనికేటికి యోచన ? విధిబలమున వేశ్యయింటనున్న మాత్రముననే సద్గుణసంపత్తి నొందుబోవుదు ? అందున్నందున విద్యల నేర్చితివి. ఆవిద్యలచే నీసురూపమింకను రాణగలిగి నినుఁజేపట్టినవాని ధన్యుఁజేయుట కాస్పదమయ్యె. నీయపాంగవీక్షణ మునకు నస్నాహసు నాపుణ్యుఁడౌనఁడోయని నినుఁజూచువారందఱు విచారింపకుందురా ? ఎవరిని జెట్టఁబట్టుదువో, ఎవరియిలు పెంచెదవో ఎవరిపుణ్యము రాణింపఁజేయుదువో ఎ. ర—

మోహి—అయ్యా ! కళానిధీ ! నిన్న మాయయ్యకు సమిధలఁ దెచ్చియిచ్చినదెవ్వరెఱుఁగుదువా ?

కళా—(స్వ) ఆహా ! కడుమూగము పోయితిఁగాబోలు (ప్ర) ఎవరు తెచ్చియిచ్చిరి ?

మోహి—అమ్మ చంద్రరేఖాదేవి నిన్న నాతో నొక మాటఁజెప్పెను.

కళా—(స్వ) ఏమిదినాకు నానావిధచింతలచే మదిదప్పినట్లు ఈమోహినికిని నాదండనున్న మదిదప్పినట్లున్నది ? (ప్ర) మోహినీ సమిధలు తెచ్చియిచ్చుటకును అమ్మ మాటాడుటకును నేమిసంబంధము ?

మోహి—(స్వ) ఏమంటినో నే నేయెఱుఁగను. (ప్ర) ఏమోయోచనతో నున్నందున నిట్లుమాటాడితి.

కళా—మోహినీ ! నాకంటె నీకాప్తుఁడెవఁడు ? నాకేల నీయోచనఁజెప్పవు ? నీయోచనలన్నియుఁ దీర్పనేఁజాలనా ? అదియుండనీ ! నీతో నొకమాటఁజెప్పవలయు. ఆతోటలోనికిఁబోయి—

మోహి—కళానిధీ ! మాయయ్య కాయసిద్ధికై పోవనున్నాఁడఁటగదా ఇంకనెన్ని దినములున్నది.

కళా—(స్వ) నాకెడమకన్ను గాటుకు గలుకుచున్నది ? గుండె దిగులుకొనుచున్నది. (ప్ర) మోహినీ ! మోహపునునకేమిటి ? నీకేమైన నెఱుఁగుదువా ?

మోహి—కళానిధీ ! మాశారదుని మాతల్లి గర్భముధరించియున్నపుడు నిన్నెవ్వరో దురాత్ములెత్తుకొనిపోయిరంట జ్ఞాపకమున్నదా ?

కళా—జ్ఞాపకము లేకనేమి ? అట్లెత్తుకొని పోయినపుడేగదా యూకస్మికముగా నిను విశారదుండు విడిపించెను.

మోహి—ఏమిట్లు మాటలాడెదవు ? విశారదుండు పుట్టకమునుపు వృత్తాంతము నిన్నను గఁగా నను విడిపించిన సంగతియేటికి ?

కళా—మోహిని ! నేను పోయివత్తును (స్వ) పాపబుద్ధి, పాపసంకటము.

(నిష్క్ర—.)

మోహి—ఇదియే నాకున్న భయము. ఇతఁడు రాకుమారుఁడుగదా? నీచజాతిలోఁ బెరిగిన నన్నెయితఁడాశించిన నేనేల వెనుదీయవలయును? అకటా! ఆమాటతలఁచుకొన గూడకుండనున్నది. ఇతనిఁజూచినవెంటనే నుదిభుగుల్లుమనుచున్నది. నిండు ప్రేమము నధికముగు నసహ్యమును గలుగుచున్నది. మఱి ప్రేమయుఁగాదసహ్యముఁగాదు. అదియే విశారదుఁడున్నాఁడుగదా?—ఏమిది? తలఁచుకొనఁగానె వచ్చెను.

[ ప్ర: విశారదుఁడు. ]

విశా—మోహినీ! మాయన్న యెందున్నాఁడు?

మోహి—ఇప్పుడే వెడలిపోయెను.

విశా—ఆహా! ఈకాలమెంత చలిగానున్నది? (కూరుచుండును).

మోహి—అట్టిచో నీయెడ కేలవచ్చితివి?

విశా—ఊరకవచ్చితిని.

మోహి—నిన్న నేమో చెప్పఁబోయి యూరకైతివి?

విశా—ఏమిచెప్పబోయితిని?—మఱి—(ఊరకుండును).

మోహి—(కొంతసేపూరకుండి) ఏమన్లెమ్రింగితివి? నాకేల గాఁచెదవు? నాప్రాణములు నీవలననే గలిగె. ఆమరణము నీయెడఁ గృతజ్ఞనై యుండవలయుదానను.

విశా—మోహినీ! నన్నేటికిఁ బ్రశంసించెదు? నేనేమొనర్చినాఁడను? నేఁబోయి వచ్చెద. (నిష్క్ర).

మోహి—ఎట్టివారియొద్దను మాటాడజంకు నేనువిశారదునొద్ద నిట్లేటికి మాటలాడెద? ఇట్టిదియే మోహము కాఁబోలును. ఇతఁడు నను మోహించియున్నాఁడు. ఇతని మౌనముద్రయే లోకములోని మాటలకన్నిటికంటె నెక్కువగా నాకుఁదెలిపెను. వేశ్యాదత్తపుత్రికి నాకీసంతోషమేల.

(అనుబంధము 32). (యవనికపడును).

—o—

## తురీయాఙ్కము-తృతీయరంగము.

### చంద్రరేఖయిల్లు.

[ప్ర: చంద్రరేఖ (కూర్చుండియుండును) పిదప మోహిని.]

మోహిని—అమ్మా! అయ్య యీజాబుఁబంపియున్నాఁడు. ఈబరణియుంగైకొనుము.
చంద్ర—(తీసికొని) ఆహా! ఇదితిలక వ్రాసినజాబు. దీననేమున్నది చదువుము.
మోహిని—(చదువును).

"చంద్రరేఖాసతీ! మూఁడు నెలలలో వత్తునని నీవలన సెలవుగైకొనివచ్చి తొమ్మిది నెలలైనను రాకున్నానని నను నిష్ఠురములాడివ్రాసిన జాబందియొంతయు సంతసించితి. నామాఁదల్లికిఁ జాడ్యముబలిసి యిప్పటికిఁ బదునాల్గుదినముల క్రిందటఁ గాలధర్మమునొందెను. కావున విధిలేక నిలిచియున్నాను. ఇఁక నొకనాల్గుదినములలోఁ బయనమై యేతెంచెదను. నినుదర్శించుకొను నభిలషమే కాక మా మోహినినిఁ జూడవలయునని మిక్కిలి కుతూహలముగలదు. నేను వెడలివచ్చిన నాఁడే యామెమారి విశారదునిచేఁ బ్రాణాపాయమువలనఁ దప్పింపఁబడి నీయొద్దఁ జేరెనని వ్రాసితివి. నేనులేనికాలమున నా మోహిని నీకు దోడుగా ఘటించినందుకు సంతసించెదను. నీకంత విశ్వాసపాత్రురాలగు మోహిని నెప్పుడు చూడఁ గలనని తీవరపడియెద. నేఁడే వెడలవలయుననియుంటి. కొంచెము జలుబు చేసినందున నాల్గుదినములిచ్చట నే యుందును.

భవత్సఖి
తిలక."

చంద్ర—(బరణిదెఱచి భయమునఁబొరవేసి) ఇదేమే మోహినీ! తేలునుదెచ్చియిచ్చితివి? పట్టియుండిన నేల్లు?
మోహిని—అమ్మా! అట్టియపాయముఁదెత్తునా? నేనొక్కటియడుగుదును. మొన్న నీవెందుకు నా పెట్టెలోనున్న నాయుంగరమును ముద్దిడికొంటివి?
చంద్ర—ఇప్పుడదియెందుకు?

మోహిని—నా యొద్దనున్న పదార్థములన్నియు నీకుఁగనుపడ్డవిగదా? ఇదియును నా పెట్టెలోనుండిన దీనిని ముద్దాడుదువో లేదో చూతుమని కొండెఁగత్తిరించి తెచ్చితి.

చంద్ర—అయిన నిటు రమ్ము. (పిలిచి ముద్దాడి) మోహినీ! ఒకపాటపాడుము నాకుఁ బ్రొద్దుపోవదు.

మోహిని—నీ కేటికమ్మ పాటలు.

చంద్ర—అదేల?

మోహిని—నీవు ముసలిదానవు.

చంద్ర—శిశువులకుఁ బశువులకుఁ బాములకుఁ గానరసము తెలియునన్న ముసళ్లకుఁ దెలియదా? చెవుడా?

మోహిని—నిన్న నేమంటినో ముసలిదాన నంటినే?

చంద్ర—కష్టమాయెను. ఊరకొక పాటపాడుము. విందము.

మోహి— (అనుబంధము 33.)

చంద్ర—ఈపాట నాకేటికే మోహినీ! నీది మిక్కిలి వికటచుతము. విటునికి భక్తిపాటలు పాడితినంటివి. ముసలికి నాకు మోహపుపాటలా?

మోహిని—నిన్న ముసలినంటివి. నేఁడు తొల్తఁ గాదంటివి. ఇప్పుడౌనంటివి.

చంద్ర—కాలభేదముల ననుసరించి గాదా యేదియు? నిన్న ముసలినైతిని. నీపాటవినఁ గొంత తరుణినైతిని. పాటలోని యర్థమునకు వృద్ధనైతిని.

మోహిని—మంచిదికాని నాకొకటితోఁచుచున్నది ఈపదునారేండ్లనుండి నీవుగను శయ్యాగృహతల్పము బూనియున్నావుకదా! తేఁపాకవేళ నతఁడువచ్చి నిన్నాశించిన తరుణివయ్యెదవో వృద్ధవయ్యెదవో?

చంద్ర—(నవ్వి) ఏమిమాట లేయివి? (పోవఁబోవును).

మోహిని—అమ్మా! ఒకమాట.

చంద్ర—నాకుఁబనియున్నది మరలవత్తును. (నిష్క్ర—).

మోహిని—తేఁపుతిలకవచ్చిన నొక వినోదముచేయుదు.

(యవనికపడును.)

## తురీయాంకము—తురీయరంగము.

### మేధానిధియిల్లు.

[ప్ర: కళానిధి.]

కళా—ఆహా! ఏమియీయాశ్చర్యము? మోహినిని జూచినది మొదలు నాహృదయము కన్నులకుఁ గట్టినట్లయి మోహంపురాగము వెలిబారుచున్నది. చూచితినా, యేమియు నెఱుఁగరాని మోహమును భయమును గలుగును. మోహమో, లజ్జయో, మరేమో తెలియదు. సత్యమో, దుష్టమో తెలియదు. అనర్థములకు మూలమో, సౌఖ్యమునకుఁ గారకమో తెలియఁజాల. ఊరకుండుదునా యూరటగలుఁగదు. మోహాతిశయమందునా భయాధిక్యముగలదు. అట్టిది మోహమగునా? భయాతిశయ మేయన్న మోహమున్నదిగదా? ఇట్టివ్యతిరేక మనోధర్మముల కాశ్రయమేమో తెలియదు. ఇఁక నాతన్వంగి యాశయమెట్లో! మోహముగలదందునా? ననుమాటలాడనియ్యదు. లేదందునా? కలదనియేల చెప్పను? లజ్జయందునా, మిగిలినమాటలన్నియు నిశ్శంకముగానాడును. దానిఁదలఁపరాదన్నఁ దలఁపునకుఁ దప్పకవచ్చును. తలఁచితినా, మనసు భుగుల్లు మనుచున్నది. చూడఁజాల. చూడకుండఁజాల. తలఁచఁజాల. దలపకుండఁజాల. పోవఁజాల. పోవకుండఁజాల ఊరకుండఁజాల. సూచఁజాల హా! దైవమా!

(కూర్చుండును).

[ప్ర: విశాఖుఁడు.]

విశా—అన్నా! జననిపిలుచుచున్నది.

కళా—విశాఖా! ఏమపని?

విశా—నే నెఱుఁగను.

కళా—ఎవరున్నారు?

విశా—మోహినియుఁ జెలికత్తెయు.

కళా—మోహినియున్నప్పుడే పిలిచెను. దానిఁజూచియున్నావుగదా? నీయభిప్రాయమేమి?

విశా—ఏమభిప్రాయము?

కళా—ఎట్టిదియని నీ తాత్పర్యము?

# తురీయరాజ్యము-పంచమరంగము.

## చంద్రరేఖనగరు.

[ప్ర: మోహిని.]

మోహిని—నా చపలత్వమునకు నొకభంగమైనది ఇంకొకభాగము కానలయు తిలకను గనుగొంటిని. చంద్రరేఖకుఁ జెవుపోకలిగియున్నదనియు గట్టిగామాటాడునప్పుడు విన రాదనియుఁ జెప్పితి అట్లనే యీమెకుఁ జెప్పిన మిక్కిలి వినోదమగును శ్వాస కోశములు పగులునట్లు నవ్వుచెదరు.

గీ॥ ఒకరినొక్కరు చెవుడంచు నుఱుముఁబోలె।
నఱచిగొంతులుచినుఁగఁగా నఱచువారు।
బలువినోదంబునెలకొను శ్వాసకోశ।
ములుపగులుదాఁక నవ్వంగఁగలుగునాకు॥

[ప్ర: చంద్రరేఖ.]

మోహిని—అమ్మా! తిలకవచ్చియున్నది.
చంద్ర—ఎక్కడ?
మోహిని—ఉద్యానవనమునయున్నది. వచ్చుటకుఁ గొంకుచున్నది.
చంద్ర—ఎందుకు?
మోహి—మొన్నయిన జలుబువలన నత్యంతము చెవుసుపట్టియున్నదఁట గట్టిగానేగాని పలుకు వినరాదఁట ఇదె నమకొను వేళకువచ్చెను. (ప్రక్కకుబోయి యుండును)

[ప్ర: తిలక]

తిలక—(గట్టిగా) చంద్రరేఖాదేవీ! కుశలమా?
చంద్ర—(గట్టిగా) తిలకా! నీకుంగుశలమా? నాకుమిక్కిలి వ్యసనమగా మున్నది.
తిలక—ఎందుకు?
చంద్ర—ఈచెవుడువచ్చినందుకు.

తిలక—ఇంక నేటినుండి కలుగవచ్చును. ఇంతగూటములు కొట్టినట్లు చితివి. చెప్పను గలుగకుండునా ?

చంద్ర—మోహినియెక్కడ ?

మోహిని—(ఇంతవఱకు నవ్వుచుండి ముందరకువచ్చి) అమ్మలారా! నాకడుపు పట్టు వట్టియున్నది. ప్రక్కరొమ్ములు పగిలిపోవుచున్నవి మీకెవరికిఁ గాదు. నాకుఁ జెప్పుము.

తిలక—ఇది యాతిన్వికుత్సితమా? భోగముదానింటఁ బెఱిగినందు కింతమాత్రమైన నేర్వకున్నదెట్లు ?

చంద్ర—తిలకా! ఆమాటనకుము. నాకుఁగోపము గును. పసిబిడ్డయే మెఱుఁగును ? మనము బుద్ధిహీనులమైతిమి.

(మోహిని నిష్క్రమించును.)

[ప్ర: మేధానిధి, కళానిధి, విశారదులు (భయమున) ]

అందఱు—ఏమి? ఏమి ? ఏమైనది ?

మేధా—చంద్రరేఖా ! ఏమి యీయార్భాటము ?

చంద్ర—నాకును దిలకకును జెవుడుగల్పించి మమ్ముఁదెగనటిపించినది.

మేధా—ఎవరు ?

చంద్ర—మోహిని.

మేధా—ఏదీ ?

చంద్ర—ఉండెనే. పోయెనేమో.

కళా } ఇంతమాత్రమేనా ?
విశా }

(నవ్వుచు నిష్క్ర).

తిలక—దేవీ ! నాకుఁ బ్రయాణాయాసము. పోయి విశ్రమింతు.

(నిష్క్రమించును).

మేధా—చంద్రరేఖా ! మోహినివిషయమై మాటలాడ నేవచ్చుచుంటి.

చంద్ర—దానివిషయమేమి ? ఇంకను నాకునవ్వుతీఱదు.

మేధా—కళానిధి వైఖరి యీలాగే పలుఁగనియున్నావా ?

చంద్ర—కనియున్నాను. చిత్రవిధముగానున్నది.

మేధా—నేను గ్రహించియున్నాను వాఁడు మోహినిని మోహించియున్నాఁడు.

చంద్ర—నాకటులతోఁచదు. మోహినియుఁ గళానిధియు నేకతమున సంధించినది చూచియున్నాను. ఎనుకైనపుడంతయు వీఁడోరఁగాఁబోవును. పిచ్చివానివలె మాటాడును మోహమున్నఁ బ్రేమపుమాపు వెలువడదా? వేశ్య పెంచినదని యసూయపడుచున్నాఁడనియెంచి నేనుదండింపనైతను దండించితి.

మేధా—నేనుజూడఁగా వానికిఁబిచ్చిమోహమని యెంచెద. ఒకమాటడిగిన వేరొక మాటచెప్పును. ఒకచోటికిఁబొమ్మన్న నొండొకచోటికిఁ బోయియుండును. ఏకతమున నధిక విచారగ్రస్తుఁడై తనలోఁదానే మాటలాడుకొనును, ఇది మోహమునఁ గా కొండువేఱనఁగాదు

చంద్ర—విశారదుఁడు మోహినిని మోహించియున్నాఁడు. అట్లైనను విశారదుఁ బ్రేమపుమాపునఁజూపును. ఎప్పుడైన నీకళానిధి విశారదుల చిన్ననాఁటిసంగతులు చెప్పుచుందునుగదా కళానిధిచరిత్రము వినివినముల వినును. విశారదుచరిత్రమన్నఁ జెవులుబెంచివినును.

మేధా—ఇందువిూఁదనే నీనిర్ధారణమా?

చంద్ర—మఱియొకటి. నేనెప్పుడైనఁ గళానిధిఁబిలువుమన్న నేదోయొక నెపమిడి పోకుండును. విశారదుఁబిలువుమన్నఁ జెప్పుటకంటె ముందుగాఁబోయి పిలుచును.

మేధా—ఆఁడువానవు. ఆఁడువాండ్రు మోహమెట్లు ప్రకటించుటయెఱుఁగవా? కళానిధిపై మోహమువలననే వానిఁజూడఁగోరదు. విశారదునెడ్ల నేవిశేషము లేకుండున నగపడకపోవును. పోనీ. కళానిధియే కానీ విశారదుఁడే కానీ మనమిందులకు సమ్మతింపవలెనా యని యడుగుటకే వచ్చితిని నీవేమందువు?

చంద్ర—ఏమా క్షేమము? సంవత్సరమునుండి యీకుమారిని జూచియున్నాను. ఆచారమర్యాదలనెల్లఁగంటిమి. ఎంతమంచిపడుచు! ఇట్టిదికోడలగుట కేమాటంకము?

మేధా—మంచిమాట. నేనునట్లే పరిష్కరించియున్నాను. మోహినీ!

[పునః ప్రవేశము మోహిని.]

కళానిధి విశారదులఁబిలిచికొని నీవురమ్ము.

మోహి— (నిష్క్ర).

చంద్ర—నాథా! ఇదియేటి కిపుడే పరిణయముఁ జేయుదువా?

మేధా—నేను వీరియెదుటఁ గొన్ని మాటలాడఁగోరెద.

చంద్ర—ఏమిమాటలు?

[పునః ప్రవేశము మోహిని, కళానిధివిశారదులు.]

మేధా—మీరందఱుఁ గూర్చుండుఁడు. సతీసుతులారా! ఆలకింపుఁడు కుమారీ! మోహినీ! ఆలకింపుము.

(అనుబంధము 34.)

నినుజూచిననాఁటినుండి నీయందుమాకందఱకు సదభిప్రాయముగలిగె. ఆయభిప్రాయమునకుఁ గుందు రాకుండునట్లును మీఁదుమిక్కిలి యిందునకువన్నె వెట్టునట్లును నీవుమాయెడ వర్తించితివి. నిన్నుసమధిక విశ్వాసమునఁ గూఁతురికంటె నెక్కువగా భావింతుము. నీ జననీజనకుల వృత్తాంతమరయఁ బంపఁబడియున్న చంద్రమౌళి భట్టారకుఁడు నాల్గుదినములలో వత్తునని వ్రాసియున్నాఁడు. అతఁడు కార్యము సాధించుకొనక రాఁడు. నిష్ఫలమైనట్లుండెనా యిన్నిదినములుండియుండఁడు. ఎవరనేల విచారింపవలయును? నీదుసద్గుణమాహాత్మ్యమును, నీదుసత్ప్రవర్తనా విశేషమును, నీసుశీలతాప్రభావమును, నీదు మానసనిశ్చలత్వగరిమమును నీ యున్నతవంశఖ్యాతియు జననమును దప్పక చాటెడు. మామనసునకెక్కియున్నది ఆదరపూర్వముగ నేనొకటిఁ జెప్పెదను. అదినీవాచరించిన మామనసున మహానందముజనింపఁ గలదు.

మోహి—జనకా—

మేధా—కుమారీ! నేఁజెప్పెడుమాటలన్నియు వినుము—మహానందముజనింపఁగలదు. అదియేమన్న, నా కుమారులిద్దఱిలో నీమనసునచ్చినవానిఁ బరిణయము గావలయుననుటయే. ఇదనిన్నుఁ బ్రార్థించుటగాని, యాజ్ఞాపించుటగాని గ్రహింపవలెను. ఈవిశారదు జననమునకుమున్ను నాకుఁ గూఁతురుగలుగవలెనను నభిలాషముండెను. కలుగునని యెఁబెద్దలు చెప్పుచువచ్చిరి. కూఁతురుగలిగిన సుయోధనయను పేరిడఁదలఁచుకొని యుంటి. దైవమట్లుచేయక మరియొకకుమారుని విశారదు నాకిచ్చె. కూఁతురులేకున్న నేమాయెను? అంతకంటె నెక్కువగు కోడలివి నీవయ్యెదవుగా? ఆతుచ్ఛవేశ్య నీకొనర్చిన మోహినియను నామకరణము నేఁటినుండి నీకువలదు. నాకుఁబ్రియమైన

సులోచనాభిధానమే యుండనిమ్ము. సతీసుతులారా! ఇంతనుండి యీకుమారిని మీరు సులోచనయనియే పిలువవలయును. మోహినీ! కాదు సులోచనా! ఈమోహిని యనుపేరు నీకెంత సుచిరముగానున్నను నెంత యన్వర్థముగానున్నను వలదు. నీకు నామకరణ మొనరించితిమి. నీవింకమాదానవు

సులో—జనకా! నాభాగ్యము నెంతని నుతింతును.

(అనుబంధము 35.)

నీయాదరణమతిలోకము. నేనావేశ్యయింటనున్నపుడు కొన్నిదినములలోనే నాయంతమున్నట్లు భావించుచుంటిని. అదితప్పక నన్నుఁజెఱచును, నేదప్పక హత్యఁజేసికొందునని యెంచియుంటి తప్పె. తప్పినను బెనముపైనుండి త్రోయనిఁబడిన చందమున దిక్కులేని యనాథగతి ప్రాప్తించె ఒకనిమిషమునఁ గాచుకొంటిని. అదియుఁ దప్పె. ఇన్నిభంగముల నాకొనర్చిన దైవమున్నియుఁ బోవునట్లుగాఁ గడకు మిమ్ముఁ జూపించెను. ఇప్పటి సంతోషము నావెనుకటియాపదల నన్నిటిం గాలఁగూలఁదన్నె. తొలుత నాకున్న దుఃఖము లాజన్మముండునని భావించియుంటి. చచ్చువఱకు మఱవనని యెంచియుంటి. మీయిల్లుచేరిన రెండవనాఁడే వానినన్నిటిని మఱచితి. మఱచితి—నిక్కముగా మఱచితి. మీయాదరణము మీవిశ్వాసము నేనుడువవలయు? నీప్రసాదమునకుఁ బాత్రనెంచియుండిన సులోచనాభిధానము నాకు నేఁడొసఁగిన ఋణ మెన్నిజన్మములకుఁ దీరును? అదియుఁగాక, యిష్టామాతాపితృకనై, మానినీకులగోత్రనై, మాతాపితృబాంధవనై, యనవరతప్రాప్తపదప్రతిష్ఠనై, యాశ్రితనై, యనాథనై, యానందనీతాశ్రయమునై యున్న నామాట—నేను నిష్కలుషననుమాట—నేఁ జేసినన్యాసము మాట—ఈమాట—నామాట యాగ్రహము నమ్మి, నన్నుఁ గోడలిఁగాఁ జేసికొన నెంచితివి. నాభాగ్యమున కేమందును? నాపుణ్యము నెంతని చెప్పుదు? నాకైనను నెంతనుతింతు? ఇంక నేమనఁగాఁ జాలను. నాసంతోషము నామాటల మ్రింగుచున్నది. కంఠము గద్గదించుచున్నది. నాలుక బిగఁబట్టుచున్నది. నోరు మూయుచున్నది. (సాష్టాంగముగ నమస్కరించి దుఃఖించును).

మేధా—(లేవనెత్తి) కుమారి! దుఃఖింపకుము. ఈచిన్నతనముననే యెన్నిదుఃఖములకుఁ బాలైతివి! ఎన్నియసిధారావ్రతముల సలిపితివి? ఎన్నివిషమపరీక్షల మీఱి నిష్కలుషవై వెలికివచ్చితివి? అమ్మా! నీవు దుఃఖించిన నాకుఁ దుఃఖము గలుగును. అమ్మరో! సులోచనా! దుఃఖింపకు. (అందఱు దుఃఖింతురు)

(అనుబంధము 36.)

[ప్రః బ్రాహ్మణుఁడు.]

బ్రాహ్మ—రాజేంద్రా! అవంతిపురమునుండి యీజాబుఁదెచ్చియున్నాను. మంత్రి గుప్తరాజు మణిలంబురము చేరినాఁడు (జాబిచ్చును).

మేధా—(చదువును).

"రాజర్షి చంద్రా! నేనుశత్రువుచే జయింపఁబడి రాజ్యభ్రష్టుఁడ నగుటయు, నా పినతండ్రి పుత్రుఁడు చెఱనునుపఁబడుటయు మీకువిదితములేయగదా? నేనీపట్టణము విడిచిన యెనిమిది దినములకే నాకును నాభార్యాసుతులకును నెడఁబాటుగలిగె. మీయూరికైన రావలయునని వచ్చుచుండి దారిలో నీతివేదింగాంచి యక్కడి యుదంతములువిని శోకవారాశిమునిఁగితి. వెనుకఁదిరిగి యెందైన దాఁగియుంద మనియు,సతీసుతుల పోకడలరయుదమనియు రాఁగ, విశ్వనాథపురము నికట మున—నేమి చెప్పుదు? మృతిఁబొంది నాలుగైగు దినములైయుండిన నాభార్య శవముం జూచితి. కుమారుని గతియేమో తెలియదయ్యె. ఇదివఱకుఁదెలియదు. తరువాత వృత్తాంతమువ్రాసి యొకరిచేతనో పంపినదిమాత్రము నాకుజ్ఞాపకము. వెంటనే నాకుఁ బిచ్చిపట్టెను. ప్రజ్ఞలే కంగవస్త్రములు నైశిథిలమాని ఫలాహారుఁ డనై జలాహారుఁడనై నిరాహారుఁడనై యెందెందోతిరిగియుండవలయును. నాకిప్పు డామూడుమాసములక్రిందటఁ దెలివిగలిగె. అప్పుడు నేనుండిన ప్రదేశము వారణాసి. ఇంక మీనేమొనర్చితినో తెలియదు".

సంగ్ర—నలుల వృత్తాంతములేల వ్రాయును?

మేధా—ఏమో తెలియదు ఎనిమిది దినములక్రిందటనే మనకు జాబువచ్చియుండెనే—

కళా—(జాబు చదువును).

"తరువాత నందుండి మాపట్టణమువృత్తాంతము తెలిసి వచ్చితిని. ఈవృత్తాంతము లన్నియు నాకుఁదెలివివచ్చిన కొన్ని దినములకే మీకుజాబువ్రాసి పంపియుంటిని. మీకుముట్టియుండునో లేదోయని మరల నీజాబువ్రాసితి. ఫణికేతుఁడు సంవత్సరముక్రిందట మృతిఁబొందియుంటయు వెంటనే ప్రకృతిజనులు నాపితృవ్య పుత్రుని జయపాలునిఁజెఱవిడిపించి రాజ్యాభిషేకముచేసియుంటయు వాఁడు నను వెదకించుటయు, వాఁడువ్రాసినజాబులవలన మీకుఁ దెలిసియుండును.

నేనీవృత్తాంతములనెఱిఁగి పురికివచ్చి మొన్నఁజేరితి. నేనొక మూఁడు దినములలోఁ బయనమై మీయొద్దకువచ్చువాఁడ. మీవిశాఖునిఁజూచియే యుండలేదు ఇరు వదియేండ్లక్రిందటఁ జూచిన కళానిధి యెట్లున్నాఁడో చూడవలెను. నా చెలియ లెంతిబాధపడినను దిలకసాహాయ్యమునఁ గడతేఱి మీరందఱిప్పుడు సుఖులుగా నుండుటవిని సంతసించుచున్నాను ఈసంతోషమే మాజయసేనుని వలని దుఃఖము నర్ధముతగ్గించినది. నాతమ్ముఁడు మీకు వ్రాసిన జాబులలోఁ దనకూఁతురిఁ బ్రియంవదను మీకళానిధికిత్తునని వ్రాసియుండెనఁట. మీప్రత్యుత్తరములలో నావిషయమే వ్రాయలేదఁట. అయినను సమక్షమమున నన్నియు మాటలాడ వచ్చును".

స్యాలకుఁడు,
మంత్రగుప్తుఁడు.

అందఱు—ఏమీ సంతోషవార్త!

విశా—(స్వ) ఈ జయసేనుఁడను పేరు నేనెక్కడనో వినియున్నాను. మాజననీ జనకులు మా మాయకొమరుకు పేరు చెప్పినట్లులేదు కలలో నెందో విన్నట్లున్నది.

కేశ—నా—(కీసుఖులెంగా! వేళ యాయెనది నేఁడు సుదినము. ఇఁకఁ బోవుదము.

(నిష్క్ర.)

—: తురీయాఙ్కము సమాప్తము :—

—:0:—

శ్రీ

# చిత్రకారి నాటకము

:o:

వంగదేశరాజ్యము-ప్రథమరంగము.

మేధానిధి యిల్లు.

[ప్ర: సులోచన (నిద్రించుచుండును) తిలకప్రవేశము.]

తిలక—సులోచనా! సులోచనా! ఏమో తెల్లవాఱవచ్చినను నింకను లేవకున్నది. కళానిధిచందము మిగుల వింతగానున్నది. ఈసులోచనను మిగుల మోహించి యున్నాఁడని నాభావము. ఏమాశ్చర్యము. ఎవఁడుగాని యీసతీమణిని మోహింపఁడా? ఇంతటిగుణవతి, రూపవతి, సాహసవతి యెవరికబ్బునలయును? నేవచ్చి నాల్గుదినములైనంగాలేదు. నాకింతచనువైనది ఇట్టిదానిఁగళానిధి మోహించుటాశ్చర్యమా? మాచంద్రరేఖగారో విశారదుఁడు మోహించినట్లుచెప్పెను. ఉండదు- అతనియందా భావమేలేదు. అంతయుగాఁగ మోహములేదా నా? ప్రొద్దుకాకచ్చెను హాయిగ్గమైన మేలుకొలుపును (సులోచన ముద్దుమొగమ్మిపలిచి గేహమును బరికించి హా! శ్రీహరీ యనిమూల్గిల్లును)

సులో—(లేచి ఏమిగా నికఘోరాంధకారమువింటేని ఎవరిందుబడియున్నారు? ఆహా! తిలకా! తిలకా! యిప్పటికిఁబడితివి? లెమ్ము.

తిలక—(లేచి) సులోచనా! నీవు నాప్రాణపదకవవు. నిక్కముచెప్పుము నిన్నెవరు మల్లికయను బోగముదానికమ్మినది?

సులో—తిలకా! నీచందముచిత్రము ఏలయిట్లువికారపు చూపుచూచెదు?

తిలక—నా చందముండనీ! నేనడిగినదిచెప్పుము. ఎవరో అమ్మిరంటివే.

సులో—ఎవరో యమ్మినట్లు మల్లిక చెప్పెను. వారేదోపలమువారఁట. మఱచినాను.

తిలక—కాటిపాపలా?

సులో—ఔనే కాటిపాపలు. కాటిపాపలు. నీవెట్లెఱుఁగుదువు? తిలకా! యిప్పటికిఁ జూచెదు. నాకుభయమగుచు చెప్పుము.

తిలక — సఖి యొకటి చెప్పుము. దాఁపకుము కళానిధి నిను మోహించియున్నాఁడా?

సులో — ఇదేల యడిగెదవు?

తిలక — నేనడిగినది తొల్తఁ జెప్పుము. మిగిలిన సంగతులు నీకుఁ బిదప నెఱిఁగింతు. మోహించియున్నాఁడా కళానిధి?

సులో — నేనెఱుఁగను. కాని మాయయ్య మాత్ర మతఁడు నాకొఱకుఁ బరితపించుచున్నాఁడనెను.

తిలక — మీ యయ్య యెవరు?

సులో — దినము నీవుండి యిట్లడిగెదవు? మేధానిధిరాజును నే నయ్యయని గదా పిలుతు?

తిలక — అట్లనే పలువురు. నీవైనఁ గళానిధిని మోహించినావా?

సులో — తిలకా! ఆకళానిధిపట్ల నామనసెట్టిదని చెప్పఁజాల. అది మోహమెన్నటికిని గాదు. ప్రీతిగలదు. మోహమను పేరుఁ జెప్పినఁ జెప్పరాని యసహ్యముగలుగును.

తిలక — దైవమా! నీచేఁతలు చిత్రములుగదా?

సులో — ఇదేమే యిట్లాడెదవు? నాయట్టి మిత్రభావముననే నీసంగతియుఁ జెప్పుము.

తిలక — సులోచనా! నేనూరక వినోదమున నడిగితినని యెంచకుము. నీవెన్నఁడును కళానిధి కాస్పదమీకుము. ప్రేమింపకుము.

సులో — ఏల?

తిలక — నేను పిదపఁ జెప్పెదను —

(లోపల సులోచనా నారాయణి స్వరము).

నిద్రపోవలెననుచున్నారు పాపమ్మ తరువాత మాటలాడుదుము.

(సులోచన నిష్క్ర.)

తిలక — ఆహా! నాదౌర్భాగ్యమున కేమందును. ఈ దిమాయ కేమందును? దైవము విపరీతమున కేమందును? ఈ సులోచనను జూచినమాత్రముననే నాకేదో జ్ఞాపకమునకు వచ్చినటులే మోహావేశము దోఁచినట్లగుచున్నది అయిన నొక్కటియుఁ జక్కని జ్ఞాపకము కాదు. ఒక్కటియుఁ జక్కనియోచన లేదు. నేఁడాకస్మికముగా స్తనభాగముక్రిందట మత్స్యాకృతి పుట్టుమచ్చఁ జూచుటకు నిదితోఁచకపోయె. పుష్కరాగ్రహారమున స్మశానమున నేనుంచిన చచ్చినట్లుండిన మేధానిధి పుత్త్రియే కదా యీసులోచన? నేను మఱల నాశిశువుం గానక విచారింపఁగాఁ గాటిపాపలయొద్దకు

వచ్చియుండిరని తెలిసె. ఇంకేమి దృష్టాంతము కావలయును? ఈసులోచనకును జంద్రరేఖ పోలికకలదు. ఒక్కొక్కప్పుడు ధ్వనియు నొకటియైయుండును. ఇన్నియు మొదట నాకుఁ దెలియకుండెఁగదా! దైవికముగా నీసతీమణి మఱలఁ దన తలిదండ్రుల యొద్ద జేరినది. ఆకస్మికముగా నేవచ్చినంగాన సరిపోయెఁగాక. లేకున్నఁ గళాధి ఈసులోచనం బెండ్లిచేసికొనుచుండెనేమో. అకటకటా! ఎంతకార్యము సమకూడెను? జననీజనకులతో నీవిషయమంతయుఁ జెప్పుదునా? నన్నెంత ఘాతుకియనుకొందురు? ఏమైన ననుకొననీ. ఈవిశారదుఁ డెవరికొఱకెక్కడనుండి వచ్చెనన్న నేనుని చెప్పఁగలను. ఈవిశారదునిపై వీరికిని నీకృత్రిమ జననీజనకులపై వానికిని ప్రీతి మెండు. దానినంతయు భంగమొనర్చనదానను గాదు ఏభంగమైనను గానీ. నేనంతయుఁ జెప్పినను నామాటలు వారు నమ్మనేవలయునను కట్టెది? నాయొద్ద నే దృష్టాంతములున్నవి? పుష్కరాగ్రహారమున దృష్టిదోషముగలునను భీతిచే నొకరికైన నీసుమాయఁ దొలుతఁ జూపకుంటి పిదపఁ జూచినవారు వయసుచూచి యాశ్చర్యపడిరిగాని సంశయింపరైరి. నను నమ్మకున్న సాహసకత్తెయు మృషాలాపవనుదు. కావున సులోచన గాని విశారదుఁడు గాని మృతిబొందువఱకు దీని వెలిఁబెట్టరాదు లేదేని నాయవసాన కాలమునందైన నీరహస్యమంతయు దాఁచక వ్రాసియుంచెద ఇప్పుడుమీఁదిపోయిన దేమి. సులోచనా కళానిధుల సమాగమము వారించెదను. పిదప దైవమున్నాఁడు.

(నిష్క్ర).

—o—

## పంచమాంకము-ద్వితీయరంగము.

### చం ద్ర రే ఖ యి ల్లు.

[ప్ర: చంద్రరేఖ.]

చంద్ర—మాయన్న మంత్రగుప్తుఁడు నేఁడు రావలసియున్నది. ఇపుడు మధ్యాహ్నమైనది ఇఁక నొకపదిగడియలకు రావచ్చును. ఆపదిగడియలనునది యెప్పుడవునో యనుపించెను—ఎవరది?—

[ప్ర: సులోచన (మగరూపముతో)]

సులో—చంద్రరేఖవు నీవెయా?

చంద్ర—నీవెవగ విట్లంతఃపురమునకు వచ్చితివి?

సులో—ఆహా! నీవే చంద్రరేఖవు. నీముద్దుమొగముననే చంద్రరేఖాత్వము నెలకొనియున్నదిగదా? ఎన్నిజన్మముల సుకృతఫలముగా నిను నేఁడుకంటి. నేరాకుమారుఁడ సోమశేఖరుఁడనువాఁడ. పదియామడనుండి నీకొఱకై—

చంద్ర—పాపాత్మా! ఏమిట్లుప్రేలెదవు? కన్నునొడలుగానవో? నిన్నెవరిందు రానిచ్చినది?

సులో—తరుణీ! నీమాటలు నాకుమఱింత మోహముపెంచె. నిజముగా నీపైమోహమున నాకుఁగన్నునొడలు తెలియవు. ఆమోహమే సర్వాటంకములమాన్పి నన్నిందుఁ దెచ్చె.

(అనుబంధము 37.)

చంద్ర—పాపాత్మా! చండాలా! నీమోహమునకు అగ్నిపెట్టుము. రాజాంగనల యంతఃపురమునఁజొచ్చి యిట్టి ద్రోహపుమాటలాడదవా? నీయుసురుదీయించి చించి చెండాడింతు.

సులో— (అనుబంధము 37 ii.)

తరుణీ! నీరూపవిఖ్యాతి జగములనిండియున్నది. పసునాఁటినుండి నీమగఁడు తపసుపిచ్చిపట్టి నినుఁజూడఁడఁట, నాకొకయుద్దిచ్చిన నతనికి బుద్ధిఁగఱపెదను.

చంద్ర—హరిహరి! నేఁడెవరిమోము చూచితినో? నీచ చాండాలా! నీవేవిధవకు జన్మించినాఁడవు? మృత్యువును చేరంటము పిలుచుచున్నావే? నీకేమి వినాశకాలము.

సులో—తరుణీ! నీముద్దెంత బంగారము చేయుదు. నినుమానను. (సమీపించును).

చంద్ర—ద్రోహీ! నీపాపిష్టి నెవరుదప్పింతురు? నీకుశాపమొసఁగుదు గాక. నీవెట్టి కులటాసుతుఁడవు?

సులో—(నవ్వి) అమ్మా! ఎంతపిచ్చిదానవే? ధ్వనినైనగుఱుతింపవా? (అని స్వరూపముచూపి మరల పురుషరూపము ధరించును).

చంద్ర—(చూచి) సులోచనా! ఏమికార్యముచేసితివే? ఈమగరూపమున నెంతముద్దుగానున్నావు? రమ్మిందు. (కౌఁగిలించును).

సులో—నీపై మోహమున నే నేవచ్చుట.

చంద్ర—నాకును మోహమే. రమ్ము కూర్చుందుదము. (కూర్చుందురు).

[ప్ర: మేధానిధి (ప్రక్కన). ]

మేధా—(స్వ) మంత్రగుప్తుని వృత్తాంతము దెలుపుట కిందువచ్చిచూడఁగా నాకన్నులేమయిన భ్రమఁజెందెనా? లేక నిక్కమముగాఁ జూచుచున్నానా?

సులో—చంద్రరేఖా! నన్నొకముద్దుగొమ్ము.

చంద్ర—ఇంక సందేహమేమి? ఇదిగోముద్దు. మఱియొకటి- ఇంకొకటి (ముద్దిడి).

మేధా—హా! పాపాత్మురాలా! హా! హా! (నిష్క్ర).

చంద్ర—సులోచనా! నిన్నింతమున్నైన గుఱుతింపనైతిఁగదా?

సులో—అమ్మా! మఱియొక వేడుక చేయుదునా? మాయయ్యయొద్దకు నిట్లేపోవుదునా? అతఁడు గుర్తింపునేమో?

చంద్ర—మంచి వినోదము. పొమ్మా మందిరమునఁ బన్నశాలలోనుండును. తిరిగివచ్చి యేమిజరిగినదియుఁ జెప్పుము. (నిష్క్ర)

———o———

## పంచమాఙ్కము-తృతీయరంగము.

## చంద్రరేఖ యింటిముందర భాగము.

[ప్ర: కళానిధి.]

(అనుబంధము 38.)

కళా—అకటా! నావంటి పాపాత్ముఁడెందైననుండెనే. అయ్యో! మాతండ్రి నన్నెంతటి పనికి నియమించెను! తల్లిశిరశ్ఛేదనమెటుచేయుదును? నాచేతులెట్లాడును? మా తల్లియందేమైన నపరాధముండినఁ దానేమేమైన నొనర్పరాదా? నన్నేటికి నియమింపవలయును? అకటా! కన్నతల్లియే. తొమ్మిదినెలలు మోసి, యెంతవేదనకైన నోర్చి, కని, పెంచి పెద్దఁజేసినమాతయే- జగమునఁబుట్టి యిన్నిదినములుండినందులకు మాతృఘాతకుఁడనిపించుకొందునా? ఛీ! ఈదురిత మొనర్పఁజాల. ఒనర్పకున్న విధియేమి? అవతారమునిచ్చి భార్యయందు తానేజన్మించి, విద్యలనేర్పి పోషించిన వాఁడుగదా జనకుడు? అతనియాజ్ఞ నెఱవేర్పకుండుటధర్మమౌ! ఎట్లును నిర్వహింపనేవలయు. అయ్యో! ఎట్లునిర్వహింతును? తల్లియే—కన్నతల్లియే. ఆమె లేకున్నఁ దండ్రివలన నేమగును? ఊరకచూచి సంతోషించువాఁడుగాక, చన్నిచ్చి పెంచునా? అనవరతము కాపాడునా? ప్రక్కఁబెట్టుక పండించుకొనునా? చెప్పక ముందే యాఁకలిగుఱుతించితీర్చునా? బాధలుగలిగిన లోకముఁగనినట్లు చింతించునా? ఎందునఁ దల్లితోఁ దండ్రి సరిపోలును? దైవమా! నాకెట్టిపాటుఁగలిగించితివి? అయ్యయ్యో! నాకరవాలము వాడి పరీక్షింపను నాతల్లికంఠమాయెనా? హా! శ్రీహరీ!

(మూర్ఛిల్లును).

[ప్ర: చంద్రరేఖ.]

చంద్ర—తనయా! కళానిధీ! ఎట్టివంతలు నీకుఁగలిగె? (లేవనెత్తును).

కళా—అమ్మా! నేఁగ్రూరకర్ముఁడ కటికిచండాలుఁడ. ననుముట్టకుము.

చంద్ర—కుమారా! ఇట్టులేల మాటలాడెదు?

కళా—నేనెక్కడికుమారుఁడ? నీవెక్కడితల్లివి? నేఁగటికవాఁడను. కటికవానికైనఁ గరుణగలుగు. నాకుఁ గరుణలేకుండఁజేసినాఁడు మాతండ్రి.

చంద్ర—తనయా! నీమాటలు భయంకరములు. ఊరకమాటలాడెదవుగాక విశదముగ చెప్పవు. ఇంకఁదడసిన నాప్రాణములు నిలువవు వృత్తాంతము చెప్పుము. చెప్పకున్న నను జంపిన పాపము నీకగు.

కళా—అగ్గో! తల్లీ! నినుజంపుటకే వచ్చియున్నాను. క్రూరహృదయుఁడై మా యయ్య నినుఁదలనఱుకుమనియె. హా! నారాయణా!

చంద్ర—నారాయణ! నారాయణ! (మూర్ఛిల్లిలేచి) తనయా! నీమాటనిక్కమా! నా నాథుఁడెందులకు ననుజంపుమనెను?

కళా—అమ్మా! ఆయింతయైనఁ జెప్పఁడు. నేనడిగితిని కసరిపొమ్మనెను.

చంద్ర—అపరాధములేక దండింపఁబంపునా? (యోచించి) కళానిధీ! మఱియొకమాట. ఇంతకొక్కరగడియకుముందు నానాథుఁడిక్కడికేమైన వచ్చియుండెనా?

కళా—ఎక్కడిదమ్మా! పర్ణశాలలో జపమొనర్చుచున్నట్లుండి నన్నాజ్ఞాపించెను.

చంద్ర—(స్వగతము) నాకీశిక్షతగినదే స్త్రీనైననేమి-పురుషరూపమునన్నదాని ముట్టితి ఈదండనము విహితమే కదా? (ప్ర) కుమారా! యోచింపకాజ్ఞ నిర్వహింపుము. పతియాజ్ఞ మీఱఁద, నందునను, స్వసుతునితోఁ జంపఁబడు పుణ్యమెట్లు లభింపవలయును? అయిన నాయానతిని నేనుగట్టించియున్న విష్ణ్వాలయమునఁ బావనభిలాషమాత్రములను నాకొఱకై నెఱవేర్పుము. (యవనికపడును)

———:(

## పంచమాఙ్కము—తృతీయరంగము.

### మేధానిధి పర్ణశాల.

[ప్ర: మేధానిధి.]

మేధా— (అనుబంధము 39.)

ఆహా! నాదుఃఖమునకేమందును? ఇంతటి దౌరాత్మ్యమెన్నఁడైన వింటిమే? చేపట్టిననాఁటినుండి యొక్కద్రోహమైన నెఱుఁగని యీయఁగనకిట్టి బుద్ధి పుట్టునే? ఆకటా! నేనెట్టి కులాంగనఁగా భావించియుంటిని? ఎంతనమ్మియుంటిని? నానమ్మకము నమ్మజేసి నాశయ్యఁజెఱిచి వంశమునకపకీర్తి దెచ్చెఁగా? ఇరువదియైదేండ్లనుండి ననుబాయకుండి యిరువురు కుమారులఁగని యీనలువది యేండ్ల యీడునకా యీదుష్క్రియ? ఈయరణ్యములో దీనికిఁ దోడగలిగె? నాదుఃఖమునకేమందును? ఈయిరువదియైదేండ్లను నీఱంకులాఁడి నాశయనమును దప్పక కాఁచియుండెనను టేమి నమ్మకము? దీనికుమారులు నాకుమారులని యేమినమ్మకము? నాకేమైన భ్రాంతిగాని నేఁగాంచినది మాచితినా? అకార్యా! ఎంతినమ్మితి? ఎంతమోసపోయితి? ముందున్న మోహములు ముద్దులు కౌఁగిలింపులన్నియు వింతలయ్యెనే? పాపలన్నియు వమ్ములయ్యెనే? ఇట్టి యీఁడునకు నాకీయపయశము గలిగింపఁగాఁగారణమైన యీపాపకుఁడేవఁడు? ఎల్లప్పుడు నాయందలి మోహమునఁ దప్పక ననుదైవముగా భావించుచుండిన నాసతీమణి మనసు హరించి చనాగ్రోవఁ గొక్కించిన యాక్రూరాత్ముఁడేవఁడు? ఆదుష్టుఁడేవఁడు? ఆగుండగాఁడేవఁడు? ఆహా! నేనెంతమఱపుమఱచితి? నాశయ్య నాకార్యమునఁ జెంపఁ బాల్పడిన యాదురాత్ముని జూచినచోట నే వానిశిరముతోఁ డుదునుమాడక వెడలివచ్చి నాకొడుకునేల యాపనికిఁ బెట్టితి? అయ్యో! నాకొడుకని మగులునఁ బలుకుదు. నాకొడుకేవఁడు? అపుడే యీయిరువురిపని తీర్చియుండిన మనసునకుఁ గొంత యూఱటగల్గుచుండెనే? ఈపశ్చిమబుద్ధి నాకేలగలిగె? అకటా! ఇరువదిరెండేండ్ల తనకొడుకుకంటె నాలుగేండ్ల పసివాఁడుగానున్నాఁడే? అట్టివానితోడనా, యీహీనాభిసారిక కృత్యము? ఈనాఁటికి నాకులము మర్కటకులమాయెనే? (లేచి) ఏమిది? సిద్ధపుంగవుఁడరుదెంచినట్లున్నది. భ్రమమేమైనఁగలిగెనా?

[ప్ర: సిద్ధుఁడు.]

ఆహా! నిశ్చయము. సిద్ధసత్తమా! నమస్కృతులు ఇట్టి వేళ ననుఁ జూడవచ్చితివా?

సిద్ధ—మేధానిధీ! జ్ఞాపకమున్నదా? పదునాలుసంవత్సరములకు మున్ను మలయ శైలమున నాయొద్ద యోగనిష్ఠనుండఁగా నాల్కలుగోయుచున్న సర్పమును వేఁబట్టి నీచేతికీయవచ్చితి. నీవు భయమందితివి. మహాదార్ఢ్యత నీకింకను గలుగవలెనని నినుఁ బురికిఁబంపి పదునాలు సంవత్సరములు వ్రతముసలుప నుపదేశించితి. నేనాడినతీరున వచ్చియున్నాను. కామమునుఁ గొంతజయించితివిగాక, క్రోధమును జయింపలేవైతివి. మహాగ్రహమునఁ దప్పులేని దప్పునకు భార్యను నడుకఁబంపితివి. షడ్వర్గబాధితుఁడవైన నీకుఁ గాయసిద్ధి యెట్టుఁబోలెఁ గలుగనేరదు. రాజయోగమే నీకింక స్వామము.

(నిష్క్ర.)

మేధా—ఇదేమిపిశునుఁపాటు? ఈసిద్ధుఁడేటికిఁ దప్పులేనితప్పని నుడివె? నాకన్నులు వోయియున్నవఁగదా "తప్పులేనితప్పు"? సిద్ధుఁడుకాదా విశ్వేశ్వరుఁడు చెప్పినను నాకన్నుల నేనమ్మకుందునా? ఇంక నాకుఁ గాయసిద్ధియేటికి? మాచంద్రరేఖయే నాకుఁ గాయసిద్ధి చేసియున్నది. ఆహా! ఈపగ నేనెట్లు తీర్చుకొందు? సిద్ధుఁడు చెప్పుటకేమి? ఆజన్మబ్రహ్మచర్య వ్రతమాచరించినవానికి నా దుఃఖమెట్లు తెలియును? హా! దుఃఖము దుఃఖము (మోము మోడ్చుకొని) ఏమిది? ఆకులనాశకుఁడిక—డికే వచ్చుచున్నట్లున్నది? అయ్యో! వీనిముఖము నేనెట్లు చూతును? నావంశ యశోహాని యొనర్చినపిచాలక తన నీచాకృతి మహాగర్వసంరంభమున నాకుఁ జూప నేతెంచుచున్నాఁడు

[ప్ర: సులోచన (పురుషవేషమున)]

నీచాత్మా! నిన్నిప్పుడే ఖండించెద—(మీదికిఁబోవును)

సులో—(భయమున) ఏమయ్యా! చూచియుఁ జూడక ముందే చంపవచ్చువానివలె వచ్చెదవు? నన్నెఱుఁగవా?

మేధా—పాపాత్మా! ఏయభిసారికకు నీవుకొడుకవు? నినుఁజంపువఱకు నాకొనర్చిన యవమతి తీఱదు. (కత్తినెత్తును).

సులో—(స్వరూపముపూని) అయ్యో! ఈసులోచనను గుఱుతింపవా?

మేధా—సులోచనా! నీవిపుడెక్కడినుండి వచ్చుచున్నావు?

సులో—మా యయ్యగారియొద్దనుంటిని. నను మాధాడి నీయొద్దకుఁబంపెను.

మేధా—హా! నాభాగ్యలక్ష్మి పోయెను. (అని మూర్ఛిల్లును)

సులో—ఆహా! ఏమీవిపరీతము? అయ్యో! మాయయ్య యీరీతి పెనుమూర్ఛ నొందెనే. నేనెట్లుచేయుదు? అయ్యో! అయ్యో!

[ప్ర: ఋషికుమారుఁడు]

మునితనయా! ఇపుడయింటఁబోయి యెవరినైన రమ్మనుము. మాయయ్య మూర్ఛ నొందియున్నాఁడు.

మేధా—(లేచి) తనయా! ఎంతఘాతుక కార్యమొనర్చితి? నిన్నా కాపురుష వేషముఁ జంద్రరేఖయొద్దఁజూచి యాగ్రహించివచ్చి కళానిధితోఁ జంద్రరేఖతల తడవు సేయక తెగదీయుమంటి ముగిసియుండునే మో?—

సులో—హా! శ్రీహరీ! (మూర్ఛిల్లును)

మేధా—(లేపి) ఇందుండి నేమిప్రయోజనము. పోయివిచారింతరమ్ము.

(యవనిక పడును.)

---

పంచమాఙ్కము-పంచమరంగము.

[ప్ర: విశారదుఁడు.]

విశా—నేనడవికిఁబోయి కొంతతడవుచేసితి నచ్చువేళ కేమాశ్చర్యము! పర్ణశాలలోఁగాని యింటఁగాని యొకరులేరు ఈసాయంకాలము వేళ సంధ్యను నెక్కడఁబోయి యుందురు. ఏమిది? నాదక్షిణభుజమదరుచున్నది.

గీ॥ తలఁపఁ బ్రాణబంధుదర్శనమగు వేళఁ।
జనకు కార్యసిద్ధిఁగనెడు వేళ।
మనసులోన లేనియనుపమాన శుభంబు।
లలరు వేళ దక్షిణాంగమదరు॥

ఏమిశుభముగలుగఁగలదు? శుభములన్నియుఁగలిగింప మాసులోచన చేతనున్నది.

[ప్ర: మంత్రగుప్తుఁడు.]

మంత్ర—కుమారా! నీ వెవరు?

విశా—స్వ! ఎవరితఁడు ఎక్కఁడనో వినిన ధ్వని గానున్నది.

మంత్ర—కుమారా! నీపోలికి యెక్కఁడనో చూచినట్లున్నది. నీవిందుండు వాఁడవా లేక యెక్కఁడనుండియైన వచ్చినాఁడవా?

విశా—అయ్యా! నేను మేధానిధిరాజన్యసుతుఁడ. విశారదుఁడని—

మంత్ర—ఆహా! నా మేనల్లుఁడవా? (కౌఁగిలించి) అందునకే నీరూపము గుఱుతించితి. నీకు మేనమామనగు నాపోలిక కలిగియున్నది. (కన్నీరునించి యాశ్లేషించును.)

విశా—మామా! మంత్రగుప్తమహాపతీ! నేఁడు గాసుదినము? నీ వేటికిఁ గన్నీరునించెదవు? తొలుత నీవుఁ గన్నీరుగలిగినపుడు చిరకాలదర్శన జనితానంద బాష్పములని యెంచితి. ఇప్పుడును బ్రవహించుచున్నవిగదా? ఇవి దుఃఖాంబువులు.

మంత్ర—విశారదా! నీకు మేనమామనగు నాపోలికయుండుట చూచినంతనే పదునేఁడు సంవత్సరములక్రిందట నాచేఁదప్పిపోయిన నాసుతుఁడు జయసేనునిపై స్వాభావికముగా జ్ఞప్తిగలిగి దుఃఖముగలిగె.

విశా—జయసేనుఁడు. జయసేనుఁడు. ఎక్కఁడనో వినియున్నా నీ పేరుపిలిచినది.

మంత్ర—నా కొమాయనిసంగతి నీజననీజనకులు చెప్పఁగా వినినావేమో.

విశా—వారు చెప్పినట్టులేదు. ఎక్కఁడనో వినినట్టున్నది.

[ప్ర: ఋషికుమారుఁడు.]

ఋషి—ఓయబ్బా! ఎంత శ్రమాయె తిరిగి తిరిగి కాళ్ళులుపడిపోయె ఇంకా నాసాముదేవళిమునకు నెవరుపోదురు? (విశారదునిచూచి) ఆహా! విశారదా! నీ వెక్కఁడనుంటివి? ఎంతెఘ్నములు జరుగుచున్నవి? చంద్రరేఖాదేవిని శిరశ్ఛేదనము చేయుఁ గళానిధిని మీతండ్రి యాజ్ఞాపించినాఁడు. అందుకు విశ్వాలయమునకుఁ బోయియున్నారు ఈవఱకే మైయుండునో—

విశా / మంత్ర — హా! శ్రీహరీ! (మూర్ఛిల్లుదురు)

(యవనికపడును).

కళా—అమ్మా! నాయత్నము లేదు. (ఖడ్గము నెత్తి నిలిపి యెడమ చేతఁదీసికొని) అహో! పాపిహస్తమా! తల్లిచరణము నొత్తి శుశ్రూషచేయుటమాని యీమెకంఠము ద్రెంచు ఖడ్గముఁ జేకొంటివా? నీవున్న నాశరీరము దూష్యమగు. నిను ఖండితును.

చ॥ జగములనెందు సేయుదురు సన్నుతిదక్షిణహస్తమంచుని ।
న్నగణితరీతి దానముల నాహుతులం బితృసేవ మించుటన్ ।
వగవక తల్లిఁ జంపఁదర వారిభరించితె పాపిహస్తమా ।
యగడుననిన్ను నేఁడు తెగఁగోర్చిన దేహము శుద్ధమయ్యెడిన్ ॥

(కత్తి నెత్త).

చంద్ర—(నిలిపి) కుమారా! ఏమిచేయ నెంచితివి? ఇదియా పితృవాక్యపరిపాలనము?

కళా—భూమ్యాకాశదేవతలారా! మీరైన నాకడ్డపడరాదా? ఇంద్రాదిసురపుంగవులారా! మీరైన నీమెను బ్రతికింపరాదా? నారాయణా! ఇదిగో జనకాజ్ఞ నడపెద. మాతల్లి నిరపరాధినియైనఁగాని, లేక యీతలఁగొట్టునంతపరాధము చేయనిదైనఁగాని నేను మాతాపితృభక్తిగలవాఁడనేని, పుణ్యకార్యము దప్ప పాపకృత్యమునందెప్పుడు నామది ప్రవేశింపదేని, సత్యమే స్థిరవ్రతముగా నాచరితునేని, నీపూరకయిందుండు తాంబోస్మకాక సత్యప్రతిజ్ఞ సేయుంగుఁగలదేని, నేవ్రేయు నీఖడ్గము మాతల్లికిఁదగులకుండఁజేయుము—(ఖడ్గమెత్తును).

[ప్ర: తిలక, సులోచన, మేధానిధి (ఒకప్రక్కన శీఘ్రముగ).]

మేధా—తాళుము-తాళుము నిలుము-నిలుము (ఖడ్గముపట్టును).

[ప్ర: మంత్రగుప్త విశారదులు (మరియొకప్రక్కన).]

మేధా—కుమారా! ఉజ్జగింపుము. చంద్రరేఖాసతీ! ఇన్నిదినములనుండి నీగుణము చూచియుఁ గొంచమైన విమర్శింపక, నీయొద్ద పురుషవేషమున సరసములాడుచుండిన సులోచనను నిక్కపుఁ బురుషుఁడగా భావించి నిన్నడుగక, విచారింపక, తెగఁదీయ నిర్ధరించిన క్రూరకర్ముఁడను. పతివ్రతవగు నీశుద్ధమానసము నేకారణములేక నొప్పించిన కృతఘ్నుఁడను. ఎంత వెదకినను, ఈపాపమునకుఁ బ్రాయశ్చిత్తము గానను నను శపింపుము. కాకున్న నిదే కరవాలమున నీసుతుఁ జంపఁబంపుము.

(అనుబంధము 42.)

నను క్షమింపుము (నమస్కరించును)

చంద్ర—నాథా! ఇదియేటిమాట! పురుషుఁడు కాకున్నను బురుషవేషము ధరించిన దాని ముద్దాడినది పాతివ్రత్యమునకుఁ గొఱగామి గదా! నన్ను వధ్యము దండింపఁదగినదే. ఊరక నవ్వులాటకు నీవు విధించియుండినను నాకుఁ గొదువగల్గునా? నీపాదధ్యానము దప్పకున్న నాకే కీఁడేలకలుగు?

మేధా—అయ్యో! నేనెట్లు భరింతును? హా! శ్రీహరీ!

మంత్ర—స్యాలకా! లోకమునఁ బొఱవడనివాఁ డెవ్వఁడు? దీనికింతయేల? ఇదియొక సమయదోషము.

చంద్ర—అన్నా! నీవెప్పుడు వచ్చితివి?

మేధా—మంత్రగుప్తా! ఎప్పుడు వచ్చితివి? నిరపరాధినియగు నీచెలియలి కెంతపకార మెంచితి? నీకు ముఖమెట్లు చూపుదు?

మంత్ర—ఏల యిట్లందువు? ఇపుడు మించిపోయినదేమి?

మేధా—అయ్యో! మంత్రగుప్తా! ఇట్లందువు? మా కళానిధి యొక్కింత తడసినందునఁ జెల్లెఁ గాక లేకున్న మించిపోవకుండునా? కళానిధీ! నీవే మమ్మెల్లరక్షించితివి. లేకున్న నాగతియేమైయుండును?

కళా—జనకా! ఆవైపున నీయాజ్ఞయు నీవైపున మాతృహత్యయు సరిపోల్చి చూచుటలో నాభాగ్యవశమునఁ దప్పైనది. ఇది భగవత్కటాక్షవిశేషము.

మేధా—పుత్రా! కళానిధీ!

సీ॥ కొనియాడవలదె యో ఘనయశస్సుగుణంబు
వినుతింపవలదె నీవివేకగుణంబు।
అటునిటునరయక కటికిమానసమున
నిరపరాధిని సాధ్విఁదరుణిఁజంప
నాజ్ఞ నెట్టితి మహోదారగుణంబున
నీవు కాపాడితి నెమ్మిఁదనయ।
కొడుకవే నీవు నాకులరక్షకుండవు
నాకాచుదైవంబ వౌదుకుమార॥

తే॥గీ॥ నీదుసువిచారితయె ప్రోచె నీలవేణి।
నీదుచిరకారితయె మాకు నెమ్మినించె।
నేటినుండియు నికీర్తిఁ జాటునట్లు।
నీకుఁ జిరకారినామంబె నెగడుఁగాత॥

నీకుఁ జిరకారియను నామమిచ్చితి. నేఁడు మొదలుగా నీయశోంక జేగీయమానమగు చిరకారియను పేరఁ బరఁగుదువుగాక.

సులో—కళానిధీ! నీవెవరికెంత యుపకారమొనర్చినను, నాకొనరించిన యుపకృతికి గణనయే లేదు. నీవింత తడయకున్న నపకీర్తిభరమున నే మడియుచుంటి. మడిసిన నేమి? అపకీర్తి తప్పకుండును. అమ్మో! వినోదవశమున నేనొనర్చిన వైదమీగతికిఁ బరిణమించెఁగా? నేఁడు మొదలుగ నీదూష్యవినోదములన్నియు మానితి. ననురక్షించితివి. నాయపకీర్తిఁ బాపితివి. మాయమ్మను మాకిచ్చితివి. మీయమ్మను దక్కించుకొంటివి. చిరకారీ! నీచిరకారితామాత్రము నేఁడుండకున్న—అక్కటకటా! తలఁపఁజాల నేఁడు కృతకృత్యనైతిని. నీకెల్లప్పుడు కృతజ్ఞనై యుందు.

(అనుబంధము 43)

మేధా—సులోచనా! ఇదిగదా సమయము? నీవై మాచిరకారి నింత ప్రశంసించితివి. ఈసంతోషకాలముననే వాఁడపేక్షించి పరితపించుచున్న నీపాణినిచ్చి ధన్యుఁ జేయుమా!

సీ॥ నానాఁటరాగమున్నతిఁ జెందనీయెడ
నిన్నుఁ జూడకయున్న విన్నఁబోవు।
ఆరభిదురపాణి యాభోగమునహించు
సంతసమునను నీచెంతనున్న।
గౌరికాంభోజినీకాంతంబు నైననీ।
కన్నులఁ జూడ నేకారుచుండు।
మోదంబునను దన కేదారగౌళలె
నీవంచుఁ బూజించు దైవతముల।

తే॥గీ॥ మోహనంబగు నీముద్దుమోముగాక ।
చూడఁగాఁగోరఁడన్యంబు సుదతినిన్ను ।
ఘనరసావేశితముఁగాఁగఁ గాంతుఁజేసె ।
నెలఁతుఁజిరకారిసాక్షికితఁడుదిగఁడె ॥

మంత్రి—(స్వ) ఇందునకేకాఁబోలు నాతమ్ముని బిడ్డ విషయమై ప్రత్యుత్తరము వ్రాయకుండినది.

సులో.
చిర. } (సిగ్గువడుదురు).

మేధా—కుమారీ! ఇంకేటికాలస్యము? (అనియొకచేత సులోచనచేతిని మఱియొకటఁ జిరకారిచేతిని బట్టికలపఁబోవ).

తిలక—(నడుమదూరి) రాజర్షిచంద్రా! ఈకార్యమువలదుజ్జగింపుము.

మేధా—తిలకా! ఇట్లేల?

[ప్ర: ఋషికుమారుఁడు.]

ఋషి—రాజేంద్రా! చంద్రమౌళి భట్టారకుఁడీజాబును, నీసంపుటమును బంపియున్నాఁడు. (జాబు సంపుటమునిచ్చును)

సులో—మాజననీజనకుల నరయ నీవుపంచినవాఁడా చంద్రమౌళిభట్టారకుఁడు?

మేధా—అవునతఁడే! ఇందేమున్నదో పిదప నరయుదము. తిలకా! ఈశుభకార్యమునకేల యభ్యంతరముఁ జేసితివి?

తిలక—రాజేంద్రా! సదస్యులారా! ఆలకింపవలయు. సూర్యచంద్రులారా! మీరిందులకు సాక్షులు. నేను ఘోరకలుషమొనర్చినదానను. నేనెఱిగించువఱకు నడ్డమాడకుఁడు. ఈచంద్రశేఖరసతి పుత్త్రార్థినియైన మూర్ఖప్రాప్యముతో బాలసదనమున్నపుడొకశిశువుం బ్రసవించె. ఆశిశువువామహస్తమునందున మత్స్యాకృతిగల మచ్చయొకటియుండె. పుట్టిన యాఘడియవఱకుఁ బ్రాణముండకున్నఁ జచ్చినదని యెంచి స్మశానమునకుఁగొనిపోయి ఖననకృత్యమునకు సన్నాహములుచేసి యొకయంబరము మూసి యందుంచియుండ నాకస్మికముగా వనజంతువుల యారావమువిని భయమునఁ బరువెత్తితిని; పోవునపుడు శిశురావము వినఁబడియె. ఆశిశువునకుఁ బ్రాణమువచ్చి

నట్లూహించితిని. తిరిగిపోయి చూడఁగా శిశువుండదయ్యె విచారింపఁగా నయ్యెడకుఁ గొందఱు కాఁటిపాపలు వచ్చియున్నట్లు తెలిసె. వారేయెత్తుకొనిపోయిరో లేక వనమృగములేమైన భక్షించెనోయని సంశయించితి. కాఁటిపాపలవలన నెత్తికొనిపోఁబడి హేమనగరమున మల్లికయను వేశ్యకమ్మఁబడి యందు పెరిగి దైవవశమున మీయొద్దఁ జేరిన యీసులోచన మీకూఁతురును గళానిధి చెల్లెలును గాక యితరము గాదు నిన్న నాకస్మికముగా నీకన్య శయనించియున్నపుడు పోయి మచ్చ గుఱుతించి యంతయు నెఱిఁగితి.

మేధా—ఏమీ? ఏమీ? తిలకా! నిజమా! ఆహా! ఈచంద్రవదాళి ఛట్టాగకుఁడేమి జాబు వ్రాసినాఁడో చూతము. (చదువును).

“రాజర్షి చంద్రా! నీయాజ్ఞఁ గైకొని హేమనగరమునకు వచ్చి విచారింపఁగా మల్లిక మృతిఁ బొందియుండెను. అందందు విచారించి దానియింటికి వచ్చుచుండిన విటుల విచారింప, వారిలో మనోహరుఁడను వాఁడు కొందఱు కాఁటిపాపలు తనకా కన్నె నమ్మినట్లు మల్లిక చెప్పియుండెనని చెప్పె. వారి పేరులు తెలియవయ్యె. తరువాతఁ గాఁటిపాపలున్న నెలవులఁ బరీక్షించి దాదాఁపునఁ బదునాలుగేండ్ల క్రిందట హేమనగర ప్రాంతమునకు వచ్చియుండిన వారెవ్వరని విచారించితి. శైలధారాపురమున నున్న బొమ్మనాయకుఁడు, వీరలింగము, భైరదేవుఁడు మొదలగువారు వచ్చియుండిరని తెలిసె. ఇది తెలియుట కాఱు నెలలుపట్టె. శైలధారాపురమునకు వచ్చితిని. వారిలో బొమ్మనాయకుఁడను వాఁడు మాత్రము జీవించియున్నాఁడు. మోహినియమ్మగాఁ జిక్కిన ద్రవ్యమున ధనికుఁడై యుండినాఁడు. రెండు మూఁడు నెలలు వాని నాశ్రయించినను వాఁడిదమ్మక్కైన సంవియదయ్యె తనకేమియుఁ దెలియదనియే చెప్పుచువచ్చె. ఊరివారు మాత్రము మేదోపల్ల నమ్మెటవలన వానికి ద్రవ్యము వచ్చినదని చెప్పుచువచ్చిరి. ఇట్లే యాశ్రయించియుండ వానికి నవసానకాలము వచ్చె. నన్నే వాఁడు పిలిపించి పుష్కరాగ్రహారమున స్మశానమున గుంతత్రవ్వి పాఁతిపెట్టుటకై యందునుపఁబడిన యప్పుడే ప్రాణములు వచ్చినట్లుండిన యొక్క యాఁడుశిశువుఁ దాను హేమనగరముననున్న మల్లిక కమ్మియుండెననియు, నా చిన్నది యెవరైనదియుఁ దనకుఁ దెలియదనియు నయిన నాశిశువు మచ్చపైఁ గప్పఁబడియున్న యంబరమును మాత్రము తనకాశిశువువలన ధనప్రాప్తిగలిగిన కృతజ్ఞతతో భక్తియుక్తముగాఁ బూజించుచున్నట్టును జెప్పి యాయంబరము నాకిచ్చినాఁడు.

ఈచరిత్రమంతయు కాగితముపైవ్రాసి వారిచే వ్రాలుగైకొని నాయొద్దనుంచుకొని యున్నాను. అంబరమును మాత్రము మీకు సంపుటముచేసి పంపియున్నాను. వారును మృతిబొందెను. కొంచమైనను సంగతులిదివఱకుఁ దెలియకున్నందున నిదివఱకు మీకువ్రాయుచువచ్చిన జాబులలో విశేషములేనియు వ్రాయకుంటిని. నేడే పుష్క-రాగ్రహారమునకుఁ బోవుచున్నాను. అందువిచారించిన నింకను విషయములు తెలియ వచ్చునని తోఁచుచున్నది శీఘ్రకాలముననే వచ్చెదను.

శైలధామపురము.

ఇట్లు భవదాశ్రితుఁడు,
చన్ద్రమౌళి భట్టారకుఁడు.

మేదా—(సంపుటమువిచ్చి యందున్న చీరఁ జూపును).

చంద్ర—(చేతఁదీసికొని) ఆహా! ఏమి నాపుణ్యము? ఇది నాయది. కళానిధికిఁ గప్పియుంటిని అతని నాఁడరణ్యములో హత్యకారులెత్తుకొనిపోవ నిది నాయొద్దనుండె. నాటనుండి మూఢనైతి. రావమ్మా! ప్రియపుత్రీ! సులోచనా!

(అనుబంధము 44.)

విశా—ఇఁకనాగతియేమి? నేనెవఁడను?

మేదా—ఆయెఁగా! ఇదివఱకు నవుగను దోఁచలేదు. ఈవిశాఖుఁడెవఁడు?

తిలక—రాజేంద్రా! ఇక్కడనే నాయపరాధమున్నది. నీవేమి శిక్షవిధించినను నియ్యకొందును నేనాశిశువుఁగానక మఱలివచ్చుచో నఱచుచున్న యొకశిశువు నెత్తుకొని యాదారినివచ్చు శూద్రినొక్కతెంగాంచితి నాశిశువనియెంచి నిలువవేసితి. అదిభయగ్రస్తురాలై నాకు నొకసంవత్సరము మీరిన వయసుగల తేజోవంతుని పురుషశిశువు నమ్మెను. శిశుమరణ దుఃఖితురాలగు చంద్రరేఖకుఁ బ్రొద్దుపోవుటకుఁ గారణముగా నుండునని యింటికిఁ దెచ్చితి. చంద్రరేఖకుఁ దెలివివచ్చినపిమ్మట నామె దుఃఖముఁ జూడనోపక, యాశిశువు నేకనినట్లుచెప్పి మోసపుచ్చితి. ఆమోసము స్థిరపఱచుటకై, పుట్టినపుడే పండ్లుండెననియు, మూఁడుదినములకు మెడలునిలిచెననియు, నెలదినములకు నడువసాగెననియు, రెండునెలలకు మాటలనేర్చెననియు మృషాలాపములఁ బన్ని విశ్వసింపఁజేసితిని. మూఁడునెలల తరువాత నీవిషయము మంత్రవంతునకు జాబువ్రాసితి. ఈయపరాధమునకు నీవెట్లుదండించినను గాదనను.

నాచారుబాలాంబుజాతారిఫాలా-విరాజన్మరాళాశ్వతాతా-విశాలాబ్జనేత్రా-కృపాలోకసంగా-సదాలోకమాతా-సులీలావినోదా-పరబ్రహ్మవీవే-జగత్కర్తవీవే-పరేశుండవీవే-గిరీశుండవీవే సురేశుండవీవే-దిగీశుండవీవే-జగత్సాక్షివీవే-త్రికాలుండవీవే-త్రిలోకుండవీవే-త్రిరూపుండవీవే-త్రివాచ్యుండవీవే-త్రివంద్యుండవీవే-త్రిధాముండవీవే-చరాత్ముండవీవే-స్థిరాత్ముండవీవే - సమస్త ప్రపంచంబులందున్న జంతుప్రకాండంబులం దున్న తేజోవిలాసుండవీవే - జగద్గర్భ నిన్నున్నుతింపంగ నేనెంతవాఁడన్-హరీ నీప్రభావంబు, నీరూపవిఖ్యాతి, లోకంబులన్నిండియుండంగనీరమ్యభావంబు వర్ణింపశక్తుండనే వాఙ్మనోగోచరంబౌను దేవాదిదేవా మహత్త్వంబు,మత్స్యంబవై వారిరాశిం జొరంబాఱి యా సోమకుంజంపవే పెంపవే వేదసందోహముల్, కూర్మరూపంబు వాటించి దేవాసురుల్ మోవఁగా లేనియామందరాగంబు నందియ్యవే-ఇయ్యవేనిర్జరుల్ పొంగఁ గా నాసుధాసంపదల్ శ్వేతవారాహవేషంబుఁ జేకొంచు భూమిన్ వరారోహనీకోరచే నెత్తవే మొత్తవేతుండ్లుగా నాహిరణ్యాక్షు దేవా నృసింహావతారంబు పొంగన్ సభాస్తంభసీమం బ్రభూతుండవై యాహిరణ్యున్ విదారింపవే, నింపవే వత్సలత్వంబు ప్రహ్లాదుపై వామనాంచత్స్వరూపంబు పొంగార వై రిక్ష ధరాదానమిమ్మంచు యాచింపవే, యంపవే భూరిపాతాళలోకంబు చేరంగ వానిన్, భృగూత్తంసరాముండవై కార్తవీర్యున్ మహాశౌర్య దోర్దండసాహస్రమున్ గండ్రగొడ్డంట మర్దింపవే, త్రుంపవేవానికంఠంబు, రాముండవై యాజిభీముండవై భూరికాంతారముల్ చేరి సీతం బ్రసిసత్యాజ్ఞఁ బాలింపవే, త్రెంపవే రావణున్, రౌహిణేయుండవై దానవానీకమున్ జించి చెండాడవే, కూడవే రేవతిన్, వల్లవీలోలకృష్ణుండవై, మాతులున్

దైత్యుఁ గంసున్, నృశంసున్ సుపర్వుల్ ప్రశంసింప శాసింపవే, పెంపవే
పాండుభూపప్రజాపాళిపైఁ గూరిమిన్, సారగీతామహార్థంబు బోధింపవే
గల్కిమూర్తీ నినున్ నేనుగొండాడఁ జాలన్, విలోకింపఁ జాలన్, గుణం
బెన్నఁ జాలన్, మునీశానసందోహప్రేమావలోకా, ఘనహార్యచం
చన్మహాధైర్యరేఖా, సునిద్రోద్భవాధీశదివ్యోత్తరంగా అనాయాస
నిర్ధూతదైతేయసంఘా, ధనూత్తం. సకారమ్యనిధ్యాతశార్ఙ్గా, మనో
మాత్రసంసృష్టలోకప్రపంచా, మనోజ్ఞప్రకారత్రమాయారసింఛా,
దినాధీశమిత్రాదిదేవేశపూజ్యా, జనాలోకదుర్గమ్య మహాత్మ్యజంఝా,
అనాధారలోకాధికాధారవిజ్ఞా, దినేశానతేజోతిగమ్యప్రఖేట్రా, అనూ
చానసేవావసన్నీలకంఠా, అనాధేయగర్భస్థబ్రహ్మాండభాండా, క్షగా
గమ్యవృత్తిప్రకృష్టప్రగూఢా, అనార్ద్రప్రథారావిరాజత్కృపాఙ్గా, సుని
లాధరిత్రీ రమాసత్సమేతా, ఖనీభూతకారుణ్యభంగీసనాథా, అనాయు
త్తమాహాత్మ్య వేదాంతపాద్యా, సునాభీసరోజాతసంభూతవేధా, అనా
ఖ్యాతదుర్జ్ఞేయలీలావిధానా, సునామప్రభాజాలనిర్ధూతపాపా, సునా
శీరచేతస్సరోజద్విరేఫా సునాకద్విషత్కుంభిహర్యక్షశాబా, వినాయ
త్నసీవృత్తసల్లోకగర్భా, సనాథప్రభోపేతవైకుంఠధామా, మునీపావి
చారప్రసనిర్దగ్ధమాయా, వినీలాంచదుత్తుంగదీప్యచ్ఛరీరా అనాదిప్ర
కారస్వసంబోధలీలా సునారాయణా కేశవా వాసుదేవా, దినాధీశమధ్య
ప్రకాంతప్రకాశా, గుణాతీతవాఙ్మానసాతీతవేషా, ఘనానంతసానంద
శశ్వద్విలాసా, మనోబుద్ధికర్మేంద్రియాతీతదేహా, వినాశప్రభాపూరక
ల్పాంతవేళా, సునీడాయతాకల్పచక్రప్రదక్షా, సురారాతిశిక్షా, సురే
శానపక్షా, మదేభేంద్రరక్షా, సదాదివ్యమోక్షా, నమస్తే నమస్తే నమః

(మంగళం యవనికపడును)

—: చిరకారినాటకము సమాప్తము :—

# ఉత్తరరంగము (Epilogue).

———:o:———

[ ఒకానొక నటుఁడు ప్రవేశించి. ]

సూత్ర:— శ్రీమహనీయ మీచిరకారియనెడు
నామంబునను బొల్చు నాటకరాజ
మాలిక చితిరె మహాజనులార
పోలసీనాటకంబునఁ దేలునట్టి
సారాంశమింత యొసంగెదఁగావె
కారుణికాఖ్యుఁడు గ్రతపోధనుండు
అమలమానస మనీషాంచితోత్తముఁడు
దమశమాధికుఁడు మేధానిధియొకఁడు
వెలయనయాఖ్యుండు పితృభక్తియుతుఁడు
లలితసద్గుణుఁడు కళానిధియొకఁడు
హీతమర్యాదుండు విటచక్రవర్తి
నూతనమరుఁడు మనోహరుండొకఁడు
బాలిశుండతుల నిర్భాగ్యుండుకలుష
కీలితుండగు శ్వేతకేతుండొకండు
ఉత్తమవంశ మహోన్నతసుగుణ
వృత్తయైతగు చంద్రరేఖయొకర్తు
భూరిశాంతసమేత పుణ్యవిఖ్యాత
ధీరగుణోపేత తిలకయొకర్తు
ఈహరిఘనవేణి యిగురాకుబోణి
మోహనశుకవాణి మోహినియొర్తు
వీరిచరిత్రంబు లీవృత్తంబు

గారవంబునమీరు గంటిరిగాదె
అలవారిభంగి యింపలరఁగఁజూడ
ఫలితార్థమింత యొప్పారెనుఁగాదె
తనరమున్మున్ను మేధానిధిఁగనుఁడు
ఘనకృపాపరుఁడు సంగతభక్తిపరుఁడు
కాయసిద్ధికిఁగాఁగఁ గడఁగిరాజ్యంబు
నాయతమతిఁబాసి యడవికిఁబోయె
అతికలుషాత్ముఁడౌ నతనిసోదరుఁడు
మతిలేనితనమున మానినీమణికి
వినరానియవమాన విధములమిగుల
నొనరించినదిచాల కురతరుకలుష
భరముననాతన్వి వరతనూజాతుఁ
గరుణయొంచకహత్య కారులచేతఁ
బట్టించిచెఱనుంచి పాపుఁడై బాలుఁ
గట్టావిధింప నాజ్ఞాపించెఁగాదె
ఒకవత్సరంబు దానుగ్రతపంబు
నకలంకగరిమ నిండారంగఁజేసి
యొలమిమేధానిధి యేతెంచెఁబురికిఁ
దెలిసెఁదోఁబుట్టువు దృఢపాపమెల్ల
నట్టులఁదెలిసియు నతఁడేమిచేసెఁ
గట్టిడియనక దుష్కలుషుండునాక
క్షమియించియాతని కన్నులనిచ్చి
యమరుప్రేమమున రాజ్యంబుననిల్పె

శాంతగుణముమేలు జగతిలోనెందు
శాంతితో ధారుణి సాటిరాఁగలదె
వంచించితలఁగోయు పరిపంథినైన
మంచిమాటలఁజంపు మాదిరిఁవినరె
ఇంత శాంతగుణంబు హితరీతినుండి
కొంతయునరయక గుణమోర్వనేక
ఇదియేమియనక యొక్కింతయుఁగనక
తుద మొదల్లరయక ఘోరమైవచ్చు
కోపాగ్ని దహియింపఁ గొడుకునుఁబంపె
నేపారఁగాఁ దనయింతిఁజంపంగఁ
జూచితిరేయెంత సొబగుఘటించె
నీచిత్రభంగి యీహీనకోపంబు
నాకన్నులను నేను నమ్మనేయంచు
వేకారి తెగఁదీయు విధిఘటియించెఁ
దప్పెఱుంగఁడు తనకన్నులైన
నొప్పక నమ్మరాదొకసారియంచు
చిరకారి తడయుటఁజెల్లగాకున్న
నరుదే కులక్షయంబగుచుండెననిన
ఒడలెఱుంగని భంగినొగిఁగలిగించుఁ
గడయంచు మొదలంచుఁ గనలేమినిందు
సుతుఁడంచుఁబితయంచుఁ జూడంగలేమి
హితమంచుఁగాదంచు నెఱుఁగంగలేమి
సతియంచు నమ్మంచు సంధింపలేమి
బ్రతుకంచుఁజావంచుఁ బరికింపలేమి

పాటింపఁగా హెచ్చు పాపంబుఁ దెచ్చు
కోపంబ దెన్నఁడు గొఱగాదు సుండి.
ఈచిరకారి మహిమయిందుఁ గసరే
వాచామగోచరమై ఖరిగాదె
జనకుండు దల్లినిఁ జంపఁ దన్పంచె
జననిఁ జూడఁగ శోకసంయుక్తి ముంచె
మెల్లనఁ బిత్రాజ్ఞ మీఱరాదాయెఁ
తల్లిఁ జంపఁగఁ బాపతతి దప్పదాయె
ఇట్టిచో ధైర్యవిహీనతఁ గనక
నెట్టనఁ బిత్రాజ్ఞ నెఱవేర్ప నెంచ
నమల మానసుఁడితఁడైన కతమున
నమిత సంతోషమేయలరారెఁ దుదకు
దల్లిదండ్రుల మాటతలఁ బూనిసేయ
నొల్లని సుతుఁడు దానుర్వి వ్యర్థుండు
శాంతగుణంబునఁ జందంబు లరయ
నింతసంతోష మిట్లితనికిఁ గలిగె
నేకార్యమైనఁ బరీక్షించి యోర్పు
ప్రాకటగతిఁ జేయ వలయును సుండి.
ఈమనోహరుఁ గంటిరే జనులార
శ్రీమీఱ విహరించి చెలఁగినవాఁడు
ఉన్న వేశ్యలయిండ్ల నొగి లెక్కలేని
కన్నెఱికంబులఁ గని మించినాఁడు
మోహినిపట్ల నీమూర్ఖుండు పూర్ణ
సాహస మొనరించె సతిఁ గూడ నెంచె

ఆమోహినీసతి యతులవాఙ్మహిమ
చేసూరయె వీనితుచ్ఛేచ్ఛలనెల్ల
ఇరవారఁజెలువుగ నెంచినతన్వి
గురువారయెఁ దుదకునీకుటిలచిత్తు 96
వెలయు మోహినిబుద్ధి వెలయాండ్రకున్న
నిలుగోన విటరాజు లెందుండువారు.
శ్వేతకేతునినింకఁ జెప్పెరఁగనుఁడు
ఘాతక బుద్ధినిల్కడఁగాంచినాఁడు 100
కనుగొనరాని దుష్కార్యము ల్సేసె
గొనకుఁదానందేమిఁ గొనియెఁగనుండి
తనపాప భరమునఁదానీల్గెగాక
మెనయంగ నాయొరులేమైనఁజెడిరె 104
నిత్యుండనేనన్న నెఱనించిపాప
కృత్యంబులొనరింప గీడగుసుండి.
చెలులార పల్లవశ్రీపాణులార
కలవాణులార యోఘనవేణులార 108
చంద్రరేఖాసతి చందంబుఁగనరె
సాంద్రపాతివ్రత్య సరణికినెలవు
ఏపాపమెఱుఁగని యీయమెఁనాగఁ
గోపించిపతిఁజంపఁ గొడుకునుబంప 112
నొక్కమాటనదు సైపోపక పలుక
దక్కటాయనదు కీడాడదు భయము
జెందదుపతిభక్తి చెదరదుదుఃఖ
మొందదుపోలదే యొనరఁగీర్తింప 116

ఈనాతిచరితంబు హితదాయకంబు
ఈనారిగుణముల కెనగల్గవెందు
పదిగినంబుల చిన్నిప్రాయమునాఁడె
యొదవెను నెలయాలికొనర సిరిమణి
వెన్నతోఁగూడంగ వెలయాలినవక
లన్నియుఁబోనె నీయతివకావేశ్య
పదియునాఱేఁడుల ప్రాయంబుదాఁక
నొదవెనాశిక్షలే యుర్వినీసతికి
బుద్ధివచ్చినదినం బులనుండిచెలువ
శుద్ధవర్తనమన్నఁ జూచియెఱుంగ
దలవ్రాఁకవిద్యల నన్నియునేర్చె
నలరార సరసవిద్యలఁగూడనేర్చె
ఈరీతినుండియు నీకృత్యమునకు
నారీమతల్లిమనంబొప్పదాయె
ఇదియేమికారణం బిదియేమివిధము
ముదిరాక్షులార నెమ్మదినెంచికనుఁడు
బహుజన్మకృతతపః పరిపాకఫలము
ఆహాహా! యిదేయగుదు దిదిగామనుండె
పుట్టఁగావచ్చిన బుద్ధిపుల్లలను
బెట్టినబోనను పృథివి నట్లాట
ఘనసంగమునఁబుట్టు కలన సట్లాయె
ననఁబోను రేమొ యల్లగాహనుండె
అరియంగినామునోహాగుని మోహించు
దరవిందలోచన యటుగాన నాసఁ

బరికింపదయ్యో నొప్పకపోయెఁదీన
నరుదేమియనియెద రటుగాదుసుండి
అదియుఁగా దిదియుఁగాదన్న నెట్లన్న
మదిరాక్షులార నామాటవినుండీ
హృద్యవిద్యల వేర్పుటిది కారణంబు
విద్యగా కేమింక వేఱుకారణము
స్త్రీలకువిద్య వచ్చినఁజేటుగల్గు
నాలరులగుదురం చజ్ఞులుకొంద
ఱత్యంతమగుభంగి నాడెదరదియు
సత్యంబుగాదది సత్యంబుగాదు
అతికలుషంబు విద్యలుదెచ్చుననుట
క్షితినమ్మఁబోకుఁడీ చెల్లియలార
తన్నెందు సన్మార్గదాయినియంచు
సన్నుతించుచునుండ సతులఁజేరంగ
హృద్యోతిరమటన్న నీమాటవిన్న
విద్యాసతియు నెంత విలపించునదియు
ప్రజ్ఞావిశేషమన భానుఁడమాసి
యజ్ఞానతిమిరంబు నడఁగింపవలెనె
శీతాంశుముఖులార చెల్లియలార
ఈతీరుమీరమది నెంచిపాటించి
యీవిధిమీసుతల్ హితమతినుండఁ
గావలెననిమీరు కాంక్షింతురేని
మీసుతలకునెల్ల విద్యచెప్పింప
వాసిఁజెందుదు రిది పథ్యంబుసుండి

# అనుబంధములు.

———:o:———

అనుబంధము.

1. రాగము-ఫరజు ఆదితాళము.

చంద్ర—ఈపగఁజేసెద-వేమిదినాథా-కావవెకరుణను గైకొనిమనవి ॥ప॥

ఇన్నిదినంబుల-నెన్నడుబాయక-నిన్నుగలిసినె
నున్నతమతితో-నున్నదాన-నే-నున్నదాన-ఇటు
చన్ననౌనా-నె-మన్నమాన-నా-విన్నపమాలకింపుమా॥

2 రాగము-ఖమాజు ఛాంపుతాళము.

మేధా—భామాచనదీమానసము-నామోహాపు
ప్రేమాయతి-నీమాటల-నేమాడెద-వ్రామానిని॥
ఇటుతారుమారుగ-సాకేసారెకుసడలియెడదను
బడలికడునడలేమ-ధీరాయతిసైరాజిలకరీతిగా-నారీమణి ॥౧॥
బాలామణిలీలాయుత-మీలోకము-వాలాయము
చాలావెత-దూలాంగనీ-కేలామతి-యీలాగున ॥౨॥

3 రాగము తోడి ఆటతాళము.

చంద్ర—ఆహావిధినా-కీహీనభంగి
నూహించితెచ్చిపెట్టె-ద్రోహంబుజేసె ॥పల్లవి॥
మానరానియన-మానంబుగలిగె
నానేరమేమున్న-దోనీతివేనీ ॥౧॥

4 రాగము-పీలు ఆదితాళము.

నీతి—ఇంతపాపము-వింటిమె-యెందును వంతలన్నియు వచ్చెనాకును ॥ప॥
ఈనేరమునకు-నింతటిదండన-మానవేశుఁడు-దీనరీతిగనిలిపెను
దీనరీతిపూననైతి-మానిపోతి॥

## అనుబంధము.

5 రాగము-ఘర్జు ఆదితాళము.

చంద్ర—దీనన్నైతి-దిక్కులేని-దేమిసేతు ||పల్లవి||
ధారుణీవరసుతా-దయమాలిపోయితె
రారియించు-తీసుయూ-రారాయించు ||౧||

6 ఇంగ్లీషు మాటలు.

దొంగలు—బాపురే బాపురెజంటగూడి-మాపటేయేల నేమాటలాడి
కాపురాలన్ని గూల్పించిసూడి-దోపువెలేనియాందొంగయేడి||ప||
వల్లికినూనెలు బాగబూసి-నల్లనిబట్టలుముసుకు వేసి
పల్లెలుపట్లెలెడోసిదోసి-మళ్ళియిల్లుచేరువాడువాసి ||౧||
తాకులుగోడ్డలిమచ్చుకత్తి-సాకినకుక్కలుబువ్వపెత్తి
వాకిలితల్పులుపగలమొత్తి-నూకిమోరాకులుచించిహత్తి

6 b ఇంగ్లీషునోటు.

దొంగలు—కోబలికోబలికోబలిచల్ - తేబలితేబలితేబలిభల్
మాంబలి యీంబలిసామివాలె-మ్యాడుతాంప్రయీంపంజులెల్ల
||బాపు 3||

7 రాగం-జంఝాటి రూపకతాళము.

కాటిపాపలు—సోలిగాణి మేస్కాం-సొంపుచేరి చెసేస్కాం
కూళిభాణి గాస్కాం-కొంపజేటి చెకోస్కాం ||పల్లవి||
పెద్దబాంటి జెజ్జా-వెక్కితిరిగెమాజ్జా
యెద్దనోటికజ్జా-యెక్కలేకబజ్జా ||౨||
మంచిబాతుబాళి-మాకువచ్చెమాళి
పంచితున్మ్రాళి-సరిసరిమాంకాళి ||3||

అనుబంధము.

8　　రాగము-కమాజు　　ఆదితాళము.

తిలక—ఎన్నినాళ్లకయ్యో-యింతమాటవింటి
విన్నదనమొల్లి-నీవెచంద్రరేఖా　　॥పల్లవి॥
రావెయోమాయమ్మా-రావెయోమాతల్లీ
రావేచంద్రరేఖా-రావెమోహనాంగి

9　　రాగం-ఖమాజు　　ఆదితాళము.

చంద్ర—తిలకనీవెకళానిధి-తలపవెలయగనలసుతునిక　　॥పల్లవి॥
నీవెనాదైవము-నీవెనాబంగారము
నీవునారత్నము-నీవికిగా-నిమమలబడియుడలితి　　॥౧॥
ఓరివిశారద-యోరివిశారద
యూరకనవ్వెదె-కేరుచుగిలకిలకిలకిలయని　　॥౨॥

10　　రాగము-బేహాగు　　ఏకతాళము.

చంద్ర—సంతసింపజేసెనేడు-గాదెసుదినము
కాదెసుదినము-నేడుగాదెసుదినము
ఘనముగనేడు-మనసునదీరె
ననుమానమెల్ల ॥నేడుకాదె॥　　॥౧॥

11　　రాగము-దర్బారు　　రూపకతాళము.

చంద్ర—అన్నయెన్నినాళ్లకయ్యో-నిన్నుజూచితి
విన్ననైతినేడుగంటి-గన్నులారగా　　॥పల్లవి॥
హాకుమారనిన్నుబాసి-శోకవారిధి
నీకమాలిసోలిదిక్కు-లేకయుంటిని　　॥౧॥

12　　రాగము-హిందుస్తాని తోడి　　రూపకతాళము.

శ్వేత—క్రూరకర్ముడ-నే-ఘోరపాపుడ　　॥పల్లవి॥
తల్లితాల్మిలేకనిన్ను-బెల్లుశోకవార్ధిముంచి

అనుబంధము.

తల్లడిల్లఁజేసినాఁడ-తాళఁజాలకున్నగాప్రు||
కోపమేఁచిసికుమారుఁ-శాపివాసజంపనురీతి
శాపమిచ్చియైననాఁడు-పాపమింతఁశాపుమమ్మ ||౨||

13 రాగము-కమాజు ఏకతాళము.

మోహిని—తాపమేపట్టెపరాని-పాపిమాటలు-పాపమోచకెంతయైన
నోపినంతసేపనిగా-నాడెదె-దురితమునీ-వాడెదె
పెండ్లిపాటపాడెదె-సరసమువిడ-నాడెదె ||పల్లవి||
మాటిమాటికాటలయ్యెనేఁటిమాటలు-సాటిసూటి
పాటిలేనిమాటలెల్ల-నోటనునీ-వాడెదె ||౧||

14 రాగము-జంఝూటి రూపకతాళము.

మోహిని—ధీరా-కమలనేత్ర మురవి-దారమాధవా
క్షీరవా-రాశిశయన-శౌరి భూధవా ||పల్లవి||
మంగ-ళాంగభూరితరవి-హంగవాహనా
రంగదా-నందసుజన-సంగమోహనా||

15 రాగము-శహాన రూపకతాళము.

మోహిని—వనధిసుతాలోల-వారిదనీల ||పల్లవి||
అనఘాంచితలీలబహు-మునిసంచయపాలా ||అను||
సుమదాసురహరణాపరి-సరదాయతఖరకిరణా
విమలాంబుజనయనా-భుజగమహీక్షితశయనా
కమలాసనవినుతనామ-ఘనదైవతగణలలామ
రమణీయాగమభూష-రామకృష్ణసుకవిపోష|| ||౧||

అనుబంధము.

16 రాగము-సురటి ఆదితాళము.

మోహిని—హరికథామృతంబు గలిగిన-నరులకుసుఖవంబు ॥పల్లవి॥

17 రాగము-జంఝూటి ఆదితాళము.

మోహిని—చూచితె-తల్లిరో-నీచవాక్యములాడసాగిరి-నను ॥పల్లవి॥

పాపులై మేరున-నోపనిచోటులఁ-జూపసాగిరి-నీచ॥ ॥౧॥

18 రాగము-శాహన ఆటతాళము.

మోహిని—దీపావళి నెల్లఁ-దెలిసియూకుర్వాత్తి-చూపోపకతీసితి॥

నీపాదములనె-నేనమ్మి-తినినాకు-శాపముకాకుండఁ

బరమేశ కావవే ॥౧॥

హరినారాయణ-నిరతమునీపాద-సరసీజములెనమ్మితి

వరపీతకౌశేయ-పరిపాలింపుమునన్ను-దురితమురాకుండ

సరసీజలోచన ॥౨॥

19 రాగము కాంభోజి ఆటతాళము.

మనో—చాలదే-ఈబాలజూచిన-జాలదే

బాలసోముని లీలనేరేఖ-ఫాలమునుగన-జాలదే ॥అను॥

కావికెంపుల-కవి-తేనెల-తావియలరుల

తావిగలిగిన-మోవిచవిగని నెలసిన-జాలదే ॥౧॥

హాళిమీరిన-మేలిమోమున-బాళిదనరగ

కేళిమదనుని-కేళి నెనయగ నెలసిన-జాలదే ॥౨॥

20 రాగము-ధన్యాసి ఆటతాళము.

మనో—మరుబారికి-దాళజాలగాంతా

గురువైరముజూపదగునె యింత ॥పల్లవి॥

మోహిని—ఘనమానసపాహిగాగించితి

వినవేటక-నావిన్నపమునింత ॥పల్లవి॥

అనుబంధము.

మనో—సూనశరంబుల-మానసభవుఁడేసె
దీనుని ననుగావవే ॥౧॥

మోహిని—పరనారులనుసో-దరులనిచూడక
పరిభవింపగ-బాడియే ॥౧॥

21 రాగము-యదుకుల కాంభోజి ఆటతాళము.

మోహిని—ఇటుబాధింపగా-బాడియే-యీలాగిదేల ॥పల్లవి॥
కటకటాయిదెల్ల-కుటిలరీతిగాదె ॥అను॥

మనో—సుదతీయీచలమేటికే-చూడరాదే ॥పల్లవి॥
మదనుఁడేచసాగె-నదిగో-తాళజాల ॥అను॥

మోహిని—ధీరా-సారా-చారా-మేరా-సముదారమతి ॥ఇటు॥

మనో—బాలా-యీలా-గేలా-మేలా-ప్రతికూలగతి ॥సుద॥

మోహిని—ఘనమా-జనరం-జనమా-మనవిఁగ-వినుమా-యనుతాప
మగు ॥ఇటు॥

మనో—కలికి వలపుల్ గులుకఁగ నెలయఁగ నలరె బలుమోదమున ॥సుద॥

మనో—బలుపాపం బొనరంగఁ ననుసివి ట్లల యింపఁగ జనునదో
సముగాదె చలమూనంగ లలనావార ములగాంచి తలకిం
చంగ ॥ఇటు॥

మనో—ఘనవేణి ననునిపు గిత్రిద్రోవఁగ జనునే-విడజాలఁగ విషజాలఁగ
మనసారంగి ఘనమోదంబు జనియింపగి దనియించఁగ ॥సుద॥

మోహిని—కడుపాపంబు జడరూపంబు విడురాగంబు మిడిమేలంబు
దుడుకుననను కడుకొనియిటు దొడరగవల దెపుడుగుబలు
తడవాఁగగద ॥ఇటు॥

అనుబంధము.

16 రాగం-సురటి ఆదితాళం.

విటులు— హరికథామృతంబు-గలిగిన-నరులకుసుఖదంబు ॥పల్లవి॥
గురుతాపత్రయపరిహారణంబు-సురుచిరంబుఘన
దురితహరంబు ॥అను॥
వినయాధికములు-ఘనసద్గుణములు- వినుతిమొనగగ -జనన
బొందగ- ననుతాపంబుల- నణంగింపగజా- లినబహుశక్తుల్
జనితవిరక్తుల - దినదినముజనుమనమునదనరిన- గుణమునవె
నపిన-జనగణమును భా- వనులకా-జనులకా-ధనులకా - ఘనులకా
మునులకా- జేసెను-ఘనంబు-సువ్రత-దనంబు గురుసద్గుణంబు
పాపనిధనంబుసత్కృతి-ఘనాంబుదంబు॥హరి॥

24 రాగం-గత్తు తాళం.

మల్లిక— ఇంతటలంపముచేసి తేమొ-నా-కొంపపాడాయెనయ్యో॥
నినుగుంపటి గాలిచి-చింపి-నింపిచంపకమానసే- పాయలాడి
అంపెలాడి - అంకులాడిని - దుంపగోయించి నిన్నంపుదాన॥

25 రాగం-కాపి ఆదితాళం.

మోహిని— ఈచీరలుసొమ్ము - లేలావలదు-ఇవియేలా - నీచములగునే॥
పడుపునపనిసి-బడసెనివేశ్యా-ఉడిగెద-వెడలెద-నొల్లనొల్ల॥
సదనమెయింతయు - సహ్యామునంచె - వదలెద-
నాదనద-పాపినొత్తు ॥౨॥

26 రాగం-నాగనామక్రియ ఆదితాళం.

కొటిచెలు—భలిరెమాకొరిచెరుల మేకులము - వాంకొరిచెరులము॥పల్లవి॥
తిణ్ణాళలైనచోట్ల - తిరిపెములంటపోయి- తిణ్ణాలుమీరిసారి -
తెలిసెటితిరుడుతినము-క్షేమా- అఆ- ఎక్షేమా- ఎవరి-
సూణ్ణేకక్రీంచేము ॥౧॥
ఎల్లుదుతిగ్గిగ్గి-కల్లులెయెత్తుకొన్న పిళ్ళలకళుతులోని-జిల్లెలు
కత్తిరించి-శోల్లమా-ఊసులు-యెల్లెమాం-
ఎ అ కట్లాయివేయలెము॥

అనుబంధము.

ఎప్పటికాలికాంత్లు - యెంతెంతో చేసినట్టి - తప్పించిగున్మ్యి
గున్మ్యి-పానాల్దీసినగాని- సెప్పేమా- అటుల యిప్పేమా-
మాతప్పేమియనలేమ ॥3॥

27 రాగం-పున్నాగవరాళి తాళం త్రిపుట.

మోహిని—కరుణాత్ములైనవారు-ధరలేరె నన్ను బ్రోవ
భరమాయెఁ దాళఁజాల-పరిపాలింపఁగ రారే॥పల్లవి॥

27 (a)

మోహిని—జలపానమైన లేక-సొలసితిమూఁడునాళ్లు
పొలిసెదనపు డైన-నిలమీఁద బెట్టఁజాల॥ ౧॥

27 (b)

మోహిని—అకటా మల్లీకయొద్ద-కేఁక బోవనలయునే
వికలంబులాయెఁ బ్రాణ-నికరంబు లెల్లనాకు ౨॥

28 రాగం-నాథానామక్రియ ఆదితాళం.

కోతిచెలు—పోతులన్న-దున్నపోతులన్న ॥పల్లవి॥
ఊగనుల్లా వేమిరా-ఊగులాడేవేమిరా
పాపిపోయింటను-పానాలకున్నరా ॥౧॥
పొన్నుపెపమిరా-పోగుతా వేమిరా
కన్నుగాన వేమిరా-కొన్నుతానూడరా ౨॥

29 రాగం-ఖమాసు ఆదితాళం.

విశా—మర్మముబారయా-కర్మమెలా ॥పల్లవి॥
మర్మముచెప్పడె-మానుపించిక ॥పల్లవి॥
దుర్జనులంటి యో- దుష్టులంరా- కర్జముదీరె ద- గానిరండి ॥౧॥

30 రాగం బాగ్ రూపకతాళం.

విశా—సారసాక్షియిందురాగ-గారణమేమి
భూరికాంతారసీమ-జేరనేటికి ॥పల్లవి॥
ఏకతంబుకానజేరు-టేమికార్యము
శోకమేచిబీదవడితి-వీకమనగా॥౧॥

అనుబంధము.

31 రాగం-కల్యాణి ఆదితాళం

మోహిని—విధినాకే-సుఖమిచ్చెను-విధవిధాలసంతోషమేహెచ్చెను॥
ఇన్నాళ్ళకుగాకవము-లన్నియుదీఱచి-నన్నింపునిలిపి-పున్నెముగని
సంతాపమంతయు - నంతమునొందెను-ఎంతోయుల్లాసము -
సంతోషమాయె ॥౨॥

32 రాగం-బాగ్ ఆదితాళం.

మోహిని—చంద్రుమొప్పనిట్టిదనుచు-సిందుదెలిసెనెమోహాము
అందమురూపజూడనెలసె-గ్రందుకొన్నదాహాము ॥పల్లవి॥
మంగళాంగదర్శనమున-బొంగునంతరంగము
పొంగిపోతేనూనసమూ-లింగనంబు సంగము॥౧॥

33 రాగం-పూర్వి ఆటతాళం.

మోహిని—గంభీరమై- రాజిలె॥ జృంభితరంభోరువు
పుంభావముసంభోగము ॥పల్లవి॥
పీడగమేఘముతు-వాడగజందురుడు
ఆడగకులగిరు-లాకాశమేయుల్లాడగ ॥౧॥
కొంక ఝంకారమాలికా ఝంకారమాలికా ఝంకారమాలికా
ఝంకారమాలికా మనుసల సంగీతాజ్ఞియుపంటి॥
ధారుణిసోలగ-దారిలురాలగ
నారదునారదుము-జంగ్ఘాలమెపొంగ ॥౩॥

34 రాగం-కల్యాణి ఆదితాళం.

మేధా— రావమ్మా-కీర్తి-తేనెమ్మా-పుత్రి ॥పల్లవి॥
పిలుపలుకుమ-సుందరవనయమునుపేరు
బలముగనిచ్చెద-నెలతెత్తెకొమ్మా ॥౧॥
నీవుమాదానవు-నమ్మికగనోడలు
గావలెనమ్మయో-కనకపుబొమ్మ ॥౨॥

35 రాగం-జోగిసావేరి ఆటతాళం.

మోహిని—ననుబ్రోచి-కరుణించి-చనవిచ్చిజనకా
అనురాగమునమన్నించి-చినవాడవనఘా ॥పల్లవి॥

ఆనందభైరవి.

చంద్ర—నీమోహమగ్నిగాల నీమాటలే-మాటలాడదే-
కామింపనీదుతల్లి కే-ఉమాయుమంచదనిపల్లి సెయి ॥౧॥

38 రాగం-ముఖారి ఆదితాళం.

కళా—హాహాయిదియెంతో పాతకము-హాహా ॥పల్లవి॥
ఇంతటిద్రోహము-నేను చేయజాలుదు
సంతాపమెంతమరంతమాయె॥హాహా॥ఇది॥

39 రాగం-ఫరజు తాళంఆది.

మేధా—ఘోరపాపముకొరకై-నెనమా-నన్ను
వైరమునబాధింపగనేనేయపరాధమొనరించితి ॥పల్లవి॥
భయోత్పాతములపై బడినాదగు-సుయోగమునగలిగె
నయోనేనెట్లులోర్తునిందుకు-అంగనాజనములనమ్మగదరమే
అపారమై మఱియవాచ్యమైతగ-నిపాపమిదిగలిగె
నపాయమిటురావచ్చునెనాకిది-కృపాపరానారాయణనీవేగతి।

40 రాగం-ఆనందభైరవి ఆటతాళము,

కళా—కటకటపెక్కు-సం-కటములువడిగన్న-చటుల బాధలకోర్చి
కన్నతల్లిని
అటునిటుచూడక-కుటిలతచేకూరిఅ-గటికమానసను న-
నెటుచం-పువాడను ॥పల్లవి॥
పుల్లలోచనముల-నుల్లాసముమీఱ-నెల్లవేళ్ళబేనుని జాలిగా
నుల్లము-మిగులరంజిల్లగాపాడిన-తల్లినినటుకనే-నొల్లసెనో॥

41 రాగం-హంసధ్వని ఆదితాళము.

("గిరిరాజసుతాతనయా" యను మెట్టువరుస)

చంద్ర—ఖగరాజహయా-కమలాకరుణా ॥పల్లవి॥
త్రిగుణాత్మపదానతదేవవరా
నిగమాంచితవాక్యకలాపనుతా ॥అను॥
జలజాక్షదయా పరమందరా-చలరాజధరా-సుగుణాకరా
జలధరసుందరనీలవిభా-కలితాంగకళా-కలుషాపహరా
రామకృష్ణనుత॥

